Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102 812

రుమేనియా రష్యా సరిహద్దులలో సంఘర్షణ

# గోలకొండపత్రిక

హైదరాబాదు జిల్లా గాంధిగార్లకు ఆహ్వానాలు

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౪ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ జ్యేష్ఠ బ॥ ౭ (౨౭-౮-౧౩౪౯ఫ.) గురువారము సంచిక ౧౯

# ఫ్రాన్సులో యుద్ధము ఆపివేయబడినది

## ఫ్రాన్సు-జర్మనీ సంధిషరతులు

ఫ్రాన్సును పాదాక్రాంతము చేయునట్టివి

అయినను ఫ్రాన్సు ఒప్పుకొన్నది

జర్మనీ ఫ్రాన్సునుఓడించి పాదాక్రాంతముచేసుకొన్నది. లోబడిన కొద్దీ జర్మనీ విజృంభించినది. ఫ్రాన్సు గౌరవకరమగు సంధికోరగా అవమానకరమగు షరతులను జర్మనీమోపెను అదేమిచిత్రమో వాటికిని ఫ్రాన్సు ఒప్పుకొన్నదట.

జర్మనీవశములో ఫ్రాన్సు పశ్చిమతీరమంతా ఇచ్చివేయవలెను, దానికగు ఖర్చులనుగూడా ఫ్రాన్సే భరించుకోవలెను.

ఫ్రెంచిసైన్యమంతా ఆయుధాలను క్రిందబెట్టిపోవలెను. యుద్ధ సామానులు, యుద్ధనావలు జర్మనువశములో ఉంచవలెను.

ఇవి జర్మనీకోరిన వరాలు.

ఫ్రాన్సుదేశములో అంగబలము ఆర్థికబలము అస్త్రబలము తగ్గిపోగా వారు జర్మనీతో సంధికోరిరి. పూర్వము ౨౨ ఏండ్లక్రిందట జర్మనీ ఓడిపోయినప్పుడు వరున్న ఆనాడు ఫ్రాన్సుపక్షం ఇంగ్లీషువారికి పాదాక్రాంతులైరి. అప్పుడు ఫ్రెంచి సేనానులగు మార్షల్ ఫాష్ను ఇప్పుడుమరల సేనానిఅయిన వేగాన్ గారున్ను ఒక ప్రత్యేకరైలుడబ్బాలో కాంపీన్ అనుస్థలమునకు పోయి జర్మన్ప్రతినిధుల పిలిచి మీఆయుధాలు కిందపెట్టండి అనిచెప్పి వారికి సంధిప్రసాదించియుండిరి. హిట్లర్ ఆఅంగాన్ని మరిచిపోలేదు. ఆకోపాన్ని యిన్నేండ్లయినా దిగమింగలేకపోయినాడు. ఈనాడు అతని నక్షత్రం మెరిసింది పాతశత్రువు లొంగిసంధికోరెను. ఆదేకాంపీన్ స్థలానికి ఆదేఫాష్వేగానులు ఎక్కివచ్చిన రైలుడబ్బాను తెప్పించి ఆదేడబ్బాలో మార్షల్ కూర్చున్నతీరుగానే హిట్లరున్ను కూర్చుని ఆదేతీరుగా ఫ్రెంచిప్రతినిధులనుపిలిచి ఆదేవిధముగా సంధిషరతులను వినిపించినాడు

ఫ్రెంచివారికి హిట్లరు ౩౦ పుటలలో వ్రైప్ కొట్టించబడ్డ పెక్కుషరతులను చేతికిచ్చినాడు అషరతులంతా ఇంకా బయటపడలేదు. అయిన అందలి ముఖ్యమైన వేటివో అవి ఇప్పుడు ప్రకటింపబడినవి.

అషరతులిట్లున్నవి.

౧ ఇంగ్లాండుకు ఏసామానుకూడ ఫ్రెంచివారు పంపగూడదు. ఏఫ్రెంచిఓడకూడ కోస్తాను వదలి పోగూడదు ఫ్రెంచిదేశాన్నివదలి పోయినట్టి ఓడలన్నిటిని తిరుగా తెప్పించవలెను.

౨ ఇప్పుడు ఫ్రెంచివారివద్ద ఉండే యుద్ధసామానులు జర్మనీకి అప్పజెప్పవలెను

౩. దేశమందలి వైర్లెస్ (రేడియో) స్టేషనులన్నీ మూసివేయవలెను. ఇటలీ జర్మనీక మన్యజరిగే వ్యాపారాలకు కేమెన్నీ ఫ్రెంచివారు ఆటంకము చేయకూడదు.

౪ జర్మను యుద్ధఖైదీలను ఫ్రెంచివారు వెంటనే వదలివేయవలెను. కాని జర్మనులవద్ద ఉండే ఫ్రెంచిఖైదీలను పూర్తిసమాధానాలు కుదిరే వరకు వదలిపెట్టరు.

౫. ఫ్రెంచిదేశములో నుండే రేవులు, కోటలు, నౌకాస్థలాలు ఏమిన్నీ చెడగొట్టకుండా ఎప్పటివలె ఉంచవలెను రైల్వేలు, రోడ్లు, కెనాలులు, టెలిఫోనులు, తంతీలు, మున్నగునవన్నీ మంచిస్థితిలో ఉంచవలెను.

౬. ఫ్రెంచిదేశములో ఎంతకాలముజర్మన్ సేన ఉండునో ఆఉండినంతకాలము దానిఖర్చు ఫ్రెంచివారే భరింపవలెను.

౭: ఇదేవిధంగా ఫ్రెంచివారు ఇటలీతో సమాధానపడవలెను

౮, ఈషర్తులు పూర్తి అయ్యేవరకు అమలులోనుండును. ఇవి కేవలము యుద్ధవిరామముకొరకే (సంధిషరతులువేరేఉండవచ్చును) ఈషర్తులలో దేనికైనా ఫ్రెంచివారు భంగముకలిగించితే ఆక్షణమే ఇదిరద్దగును.

ఇవి జర్మనువారందించిన ముఖ్యమగుషర్తులు.

## బ్రిటిషువారి సమీక్ష

జర్మనులు ఫ్రెంచివారికిచ్చిన షర్తులనుగురించి ఆలోచించుటకై ఇంగ్లాండులో మంత్రివర్గము సోమవారము ౨౪ జూన్నాడు సమావేశమయ్యెను

జర్మనుల షర్తులను "చాలాముఖ్యమని" పెటేన్ మంత్రివర్గము ఒప్పుకున్నారని తెలిసినది. ఇక ఇటలీతో సంప్రతింపులు కొరకలసినందున జర్మను విమానాలలో ఫ్రెంచిప్రతినిధులు ముసలోనితో మాట్లాడుటకు రోమునగరానికి వెళ్లినారు.

## బ్రిటిషువారి ఖండన

ఫ్రాన్సు ఒప్పుకొన్నషర్తులను బ్రిటిషు మంత్రివర్గమువారు ఆలోచించి యీవిధముగా ప్రకటన చేసినారు —

ఇదివరలో ఇంగ్లీషువారికిన్ని ఫ్రెంచివారికిన్ని ఏర్పడియుండిన మైత్రికి ఈ షర్తులను ఇప్పుడు ఫ్రాన్సువారు ఒప్పుకొనుట భంగకరముగానున్నది ఈషర్తులమూలాన ఫ్రాన్సు జర్మనీకి పూర్తిగా పాదాక్రాంతమగుటను ఒప్పుకొన్నదన్నమాట అందుచేత ఇప్పుడు ఫ్రాన్సుదేశములోని బోర్డో పట్నంలో పనిచేయుచున్న ఫ్రెంచిప్రభుత్వము వారు ఫ్రెంచిపౌరులపక్షమున మాట్లాడుటకు హక్కును పోగొట్టుకొన్నవారైయున్నారు. కావున బ్రిటిషు ప్రభుత్వమువారు బోర్డోప్రభుత్వము స్వతంత్రఫ్రాన్సు దేశముపక్షాన వ్యవహరించుటకు అధికారముతేనట్టిదని ప్రకటించుచున్నారు

కొందరు ఫ్రెంచిప్రముఖులు ఫ్రాన్సుపక్షాన ఒకజాతీయసమితి ఏర్పాటుచేసి ఫ్రెంచిస్వాతంత్ర్యమును కోరువారందరికిని ప్రతినిధిగా పనిచేయనున్నారను సూచనను ఇంగ్లీషుప్రభుత్వము వారు గమనించినారు. అట్టి తాత్కాలిక జాతీయసమితి నొప్పుకొనుటకు ఇంగ్లీషుప్రభుత్వము వారు సంసిద్ధతలోనున్నారు. ఈ ఒప్పుదల ఎంతవరకైతే ఈ జాతీయసమితి అన్ని ఫ్రెంచివర్గాలకు ప్రతినిధిగానుండునో, సమానశత్రువుతో యుద్ధము చేయుచుండునో అంతవరకు దానిని "మేము అంగీకరించుచున్నాము" అని బ్రిటిషు మంత్రివర్గముప్రకటించెను.

ఈ సందర్భములో జనరల్ డీగాల్ అను ఫ్రెంచి సేనాని జాతీయసమితిని ఏర్పాటుచేయుచున్నాననిలండన్ రేడియోద్వారాప్రకటించెను.

### ఇటలీతో సంధి

జూను ౨౪ వ తేది మధ్యాహ్నముతర్వాత బోర్డియోలో ఫ్రెంచిమంత్రివర్గము సమావేశమై ఇటలీతో యుద్ధమును విరమించుటకు ఇటలీవారు విధించిన సంధిషరతులపత్రముపై సంతకము చేయవలసినదిగ జనరల్ హంట్ జైగర్ గారికి ఉత్తరువునిచ్చుటకు తీర్మానించెను, ఫ్రాన్సుఇటలీల సంధిపత్రముపై ఇటలీ ప్రభుత్వ ప్రతినిధి సంతకముపెట్టి జర్మనుప్రభుత్వమునకు ఆ పత్రమును జూను ౨౪ వ తేది సాయంకాలము ౭ గం. ౩౫ని. లకు అందజేసెను. ఈ సంగతి ఫ్రెంచి ప్రభుత్వమువారికి తెలియజేయబడెను.

## యుద్ధమాగుట

జర్మను హైకమాండు వారు ఫ్రాన్సులో తమ సేనలను యుద్ధమును జూను ౨౪ వ తే- రాత్రి ౧౧ గం ౩౫ని లనుండి ఆపుటకు ఆజ్ఞాపించుటచే అప్పటినుండి ఫ్రాన్సులోని జర్మను సేనలు యుద్ధమునాపెను. జూను ౨౫ వ తేదినాడుబోర్డియోనుండి ఫ్రెంచి ప్రభుత్వములేచి ఫ్రాన్సు మధ్యభాగములో ఎచటనైనను ఒక నగరమునకు పోవనిశ్చయించెను.

### దేశమంతటవిషాదము

బోర్డియో ప్రభుత్వమువారిచే ఫ్రాన్సులో జూను ౨౫ వ తేది మధ్యాహ్నము ౧౧ గం. లవేళ ఫ్రాన్సుదేశీయులు విషాదదినము జరుపుటకు ఆజ్ఞాపించబడిరి. ఆసమయమున బోర్డియోలో ఒకనిమిషకాలము అందరును నిశ్శబ్దముగ నుండిరి. జెండాలు టెక్కెముల మధ్యభాగమునకు దించబడెను.

### బ్రిటిషురాయబారి ప్రయాణము

ఫ్రాన్సులో ప్రభుత్వముతో బ్రిటిషుప్రభుత్వము ఇంకను ఎప్పటివలెనే సంబంధము గలిగియున్నను, ఫ్రాన్సులో అధికభాగమును జర్మనులు ఆక్రమించియుండుటవల్ల, జర్మనులచే ఎందును ఖైదుచేసికొనబడవలెనని తలచి ఫ్రాన్సు ప్రభుత్వమువెంటనుండిన బ్రిటిషుప్రభుత్వపు రాయబారియగు సర్ రొనాల్డు కాంబెల్ గారు తనక్రింది అధికారులందరితోగూడ జూను ౨౪ వ తేదినాడు ఇంగ్లాండుకు ప్రయాణమైనాడు. ఫ్రెంచిప్రభుత్వమువారి ఇంగ్లాండుదేశపురాయబారి ఎప్పటివలె లండనులోనే యుండగలడు.

### క్రొత్తఫ్రెంచిప్రభుత్వ నిర్మాణయత్నము

గాల్ జనరల్ డీ గారు జూను ౨౫ వ తేదినాడు మరల లండనునుండి రేడియో ఉపన్యాసమిచ్చుచు ఫ్రెంచినౌకాదళము శత్రువులకు లొంగదని తనవమ్మకమని చెప్పినాడు. ఫ్రాన్సునుండి పరారైన పలుకుబడి గలవారలు లండనుకు చేరుకోగానే తానిపుడు నాయకత్వము వహించియు "ఇంగ్లాండులోని ఫ్రెంచిజాతీయసమితి" యొక్క నియమావళి నేర్పాటుచేసి, ఇంకను ఫ్రెంచిజనులు పలుకుబడిగలవా

(౧౦వ పేజీ చూడుము)

## జాడతీసినవారికి బహుమతులు

నాపెద్దతల్లియగు వెంకటమ్మకు కొన్నిసంవత్సరములనుండి పిచ్చిజాడ్యము వున్నది. అప్పుడప్పుడు ఆయమ యెవ్వరికి తెలియక చుట్టుపట్టుగ్రామములకుపోవుచువచ్చుచువుండెను. కాని యీసరియాయము సుమారు రెండునెలలు అయెను యెక్కడికిపోయినదోకనబడలేదు. మేము వెతుకుచు ప్రయాసపడుచున్నాము. కనుకతమతోచేయు ప్రార్థనయేమనగా ఆయమ తమగ్రామములో మరియు చుట్టుపట్టుగ్రామాదులలో యెక్కడైన వుండినచో ఈక్రిందవ్రాయబడిన పత్తాపైన నాకు తెలుపగలరు.

ఆమెవయస్సు ౬౦ సంవత్సరాలు పండ్లువుడీ మియులేవు. కట్టుబట్టలలో వచ్చినది నల్లరంగుపుచ్చుముఖము ఆమెతోవిచారించ ఆమె నివాసగ్రామము నవాబుపేట తాలూక, మ జిల్లా మహబూబు న గ ర ము అని చెప్పును ఆమెను నవాబుపేట లేక మహబూబునగరనుకు పట్టించువారి ౫ ఆయిమియాపాయిలు బహుమతిగయివ్వబడును పోషుకతమాడపు కమ్మిచినామనవి అంగీకరింతురని ప్రార్థన

నావిలాసము

ఆది. క్రిష్టయ్య వకీలు

తమ్ముడగు చెన్నకేశవులు జిల్లా మహబూబునగరు, జుమ్మామసీదుదగ్గర.

# హైద్రాబాదునగర ప్రాచీనస్థలాలు వాటిచరిత్ర

శ్రీయుత వేమవరము ప్రతాపరెడ్డిగారు

### హుసేన్‌సాగరు

హైద్రాబాదునకు సికింద్రాబాదునకుమధ్య ఉన్న హుసేనుసాగరుచెరువునుగురించి లోకులు ఒకవినోదమగుకథ చెప్పుకుంటారు, అదేమన- మీర్ ఆలం మంత్రిగాఉండేకాలములో ఈచెరువును కట్టించెనట, కాని తనపేరుతో ప్రచారముండుటకు మారుగా దానిని జనులు హుసేనుసాగరు అనిరట ఎందుకంటే హుసేనుసాబ్ అను "మేస్త్రీ" చెరువుకట్టిన కూలీలకు దినమూ సాయంత్రము కూలీలు బట్వాడాచేయుచూ ఉండెనట, అప్పుడు మీరుఆలం వేరేయొకచెరవు నిర్మాణాన్ని యేర్పాటుచేసి తానే మేస్త్రీఅయి ప్రతిదినం కూలీలకు తానే కూలీయిచ్చుచువచ్చెనట. అందుచేత వేరే మీరాలంచెరువు ఏర్పడెనట. ఇదంతా పుక్కిటిపురాణం. నిజమేమంటె

ఇబ్రాహీం ఖుతుబుషా ౯౭౭ హిజిరీలో గోల్కొండ నవాబయ్యెను అతడు రైతులోకాన్ని ఉద్ధరింగి రాజ్యాదాయం ఎక్కువచేసేనిమిత్తం చాలాచెరువులుకట్టించెను. ఇప్పటిఇబ్రహీంపటంచెరువు మరియు కంహూరు బుద్వేలిలోను అతడే చెరువులుకట్టించెను. హుసేనుసాగరు చెరువుకూడా అతడేకట్టించెను, దానికి రెండులక్షల హొన్నులు ఖర్చయ్యెను. ఆచెరువు నిర్మాణాన్ని హుసేనుషాఅను నొకవలీ విచారించుకొనుచుండెను. అందుచేత అతనిపేర ఈచెరువు ప్రసిద్ధికివచ్చెను.

### పాతవారధి

నగరములోని మూసీనదిపై కట్టబడిన పాత వారధియొక్క నిర్మాణము రసికత్వములో కూడినదైయున్నది. ఇబ్రహీం ఖుతుబ్‌షా కుమారుడైన మహమ్మదు ఖులీ అనువాడు "భాగమతి" అను భోగముదాని మంచుకొనియుండెను. ఇప్పుడు చారుమినారుండుప్రాంతాన "చచ్లం" అను గ్రామం ఉండెను. అచ్చట ఆ భోగముది ఉండెను. దానియింటికి యువరాజు వచ్చి పోవుచుండెడివాడు ఒకనాడు తన అలవాటు ప్రకారము గోలకొండ ఖిల్లానుండి ఒయలుదేరి దానియింటికి పోవువాడై మూసీనదివరకువచ్చెను. వర్షాకాలమగుటచేత నది అప్పుడే నిండి పారుచుండెను. ప్రేమశక్తి బలవత్తరమైనది. ప్రవాహాన్ని జయించునట్టిది, యువరాజు గుర్రాన్ని ప్రవాహములోనికిదింపి ఇవతలినుండి అవతలికీదించి భాగమతియిల్లు చేరుకున్నాడు. ఈవార్తనుచారులు పాదుషాకు తెలిపినారు. తక్షణమే మూసీపై వారధికట్టవలెనని అజ్ఞాపించినాడు మరొక వర్షర్తువు వచ్చేలోపల అది సిద్ధమయిపోయెను, దానికి రెండులక్షల (బంగారు హొన్నులు (నాణెములు) వ్యయమయ్యెను. ఈవారధి ౯౯౮ హిజ్రీలో కట్టబడెను దీనినే ఇప్పటికిని పురానాపుల్ అని వ్యవహరింతురు.

### మౌలాలీ ఉరుసు

హైదరాబాదులో ఏటేట మౌలాలీగుట్టపై ఒక గొప్ప ఉరుసుజరుగును. దానికిగాను స్థానికముగా రెండుదినాలు కచ్చేరీలకు సెలవుకూడా ఇయ్యబడును. ముసల్మానులేకాక హిందువులును తండోపతండముగ ఆగుట్టకుపోయి ఫాతెహాలు చదివించి మ్రొక్కుబళ్లు చెల్లించుకొనివత్తురు బీదలేకాక ముఖ్యముగ నిజాం ప్రభువుగారును మౌలాలీసేవచేసికొనివత్తురు ఈమౌలాలీనిగురించి జనులు నానా కథలు అల్లుకొని చెప్పుకొందురు. నిజమైనకథ యిట్లున్నది.

ఇదే ఇబ్రహీం ఖుతుబ్‌షా కాలములో గోలకొండకు సమీపములోనుండు నొకగుట్టపై ఒక దేవాలయముండెను. ఒకనాడు వెన్నెలరాత్రిలో పాదుషా గోలకొండ పైభాగమందలి "బాలాహిసార్"అనుస్థానముపై ఆనందముతో అటునిటు పచారుచేయుచు ఉండెను, అట్టిసమయములో అతనికి ఉత్తరపుదిక్కున ఒకపెద్ద వెలుతురుకానవచ్చెను. ఆసమయములో రాయరావు అను పేరుగల బ్రాహ్మణుడు పాదుషావెనుక నిలిచియుండెను. ఆవెలుతురేమిటి? అని రాయరావును పాదుషా విచారించెను. "సర్కార్ అక్కడపై మౌలాలీఅనే ఫకీరుయొక్క జండా ఉన్నది అందుచేత షియ్యాలు అచ్చట అఖండదీపములుపెట్టినారు."అని చెప్పినాడు. "అట్లయితే మనముకూడ రేపు గురువారంనాడు పోయి దర్శనంచేసుకొని వత్తము" అని పాదుషా సెలవిచ్చినాడు. బ్రాహ్మణుడు యజమాని సంతోషపడుటకై ఏదోఒక తప్పుడుమాట కూసియుండెను. పరిహాస విజృంభితము తుదకు పరమార్థముగా గ్రహింపబడెను. తనమాట దక్కించుకొనవలెను. లేకున్న తన తలకూడ పోవచ్చును మరునాడే అగుట్టకుపోయి గుడిలోని విగ్రహాన్ని యెత్తి పారవేయించి మసీదువలెమార్పించి ఒక జండా పాతించి దానిచుట్టును ఒక ఆకుపచ్చనిబట్టకట్టించి అంతయు సర్వసిద్ధము చేయించినాడు గురువారము రానేవచ్చెను ఆనాడు హజరత్ ఆలీగారి ౧౩వ రజబ్‌దినము, కావున గుట్టవద్ద పాదుషా బీదలకన్నదానము బాగుగా చేయించినాడు. ఈవిధంగా అదిఏర్పడెను ఆనాటినుండియు మౌలాలీఉరుసు అనుపేర సుప్రసిద్ధముగా అదే స్థలములో జరుగుచున్నది. కారణం తెలియకున్నా హిందువులును అచ్చట సేవచేసికొని పోవుచుండుటయు ఒకవిశేషము.

### భాగ్యనగరము

మనఆంధ్రులు చాలామంది హైద్రాబాదును భాగ్యనగరమనికూడా ఇప్పటికి వ్యవహరించుచున్నారు బహుశా చాలామందికి దానికారణము తెలియకపోవచ్చును. ౯౮౮ హిజ్రీలో ఇబ్రహీం ఖుతుబుషా చనిపోయెను. అతని కుమారుడు అనగా భాగమతి అను భోగముదాన్ని ఉంచుకున్న మహమ్మదు ఖులీఖుతుబుషా అనువాడు రాజయ్యెను. భాగమతికి తానున్నచోటనే నగరము నిర్మించవలెనని కోరికపుట్టెను. మహాసౌందర్యవతి. పాదుషాగారు చేపట్టినయువతి, భోగముది. కోరికలు కృపాపాత్రం. పాదుషాగారిట్లాజాపించినారు. "గోలకొండ ఇరుకటంగా ఉంది. మాదర్జాకు తగినట్లుగాలేదు. అమీర్లకు ఇబ్బందిగావుంది. నదికి అవతలిభాగంలో నగరనిర్మాణంచేయవలసింది నాలుగుబాటలు నాలుగువీధులుండవలెను. నాలుగుకమానులు నాలుగు దిక్కుల కట్టవలెను ౧౨౦౦౦ దుకాణాలుండవలెను, ౧౪౦౦౦ మొహల్లాలు (వాడలు)ఉండవలెను."అని అజ్ఞాపించెను. నగరము సిద్ధమయ్యెను. రెండుకోట్లకన్న యెక్కువగా రూపాయీల వ్యయమయ్యెను.

### చార్ కమాను

పై విధముగా సిద్ధమైన నాలుగుబజారులలోని నాలుగుకమానులనే ఇప్పటికిని చార్‌కమాన్ అని వ్యవహరించుచున్నారు. ఇందలి ఉత్తరదిక్కునున్న కమానువద్ద ఒక వైద్యాలయము ను నిర్మించిరి. పశ్చిమదిశలో హుజూరువారి భవనాలు నిర్మించిరి. ఈ నాలుగుకమానులమధ్య విశాలస్థలమునువదలి ఒక "హౌజు"ను కట్టిరి. అందు నీరువిడిచి రమ్యదృశ్యముగా నేర్పాటు చేసిరి. తర్వాతికాలములో అందు నీరువిడుచుట లేనందున దానికి "సూఖాహౌజు" అనుపేరువచ్చి ఇప్పటికిని అదేపేరుతో వ్యవహరింపబడుచున్నది

### అషుర్ ఖానా

దీనిసమీపంలోనే జామెమస్జిద్‌కట్టిరి దీనినిర్మాణానికి ౫ లక్షలరూపాయీలు ఖర్చయ్యెను. నదీతీరమున నదీమహల్ అను నదీభాగున్ కట్టిరి. ౧౦౦౩ హిజ్రీలో ౬౦ వేలు పెట్టి "ఇమాంబాడా"ను కట్టిరి. దానినే యిప్పుడు బాదుషాహి అషుర్ఖానా అనియందురు దానిసమీపంలోనే మోతీమసీదును కట్టించిరి

### చార్ మినార్

మొత్తానికి ఈభాగ్యనగరాన్ని ముక్కోటి క్షేత్రమువలె నిర్మించవలెనని పాదుషాకు కోరికజనించియుండెను. అందుచేతనే యీ విధముగా నూతననగరములో కమానులు, హౌజు, వీధులు, మసీదు, బంగ్లాలు నిర్మించెను అచ్చటముక్కోటి క్షేత్రములో హజరత్ ఇమాంగారి రోజాఉన్నది దానికి ప్రత్యామ్నాయముగా ఇచ్చట చార్‌మినార్ కట్టించెను, దానినిర్మాణానికి ఇంచుమించు రెండులక్షల బంగారు హొన్నులు ఖర్చయ్యెను. ఈ చార్‌మినార్ ౧౦౦౦ హిజ్రీలో నిర్మింపబడెను

### నగరవ్యాప్తి

యథారాజా తథాప్రజా. పాదుషాగారి జాడచిత మీర్లుకూడా పెద్దపెద్దబంగ్లాలు తోటలు, బాటలు, కట్టించి వేయించిరి. నూతననగరమునకు నాలుగుదిక్కుల పరిసరములనుకూడా పట్టణవ్యాప్తి పొందెను అందుచేత ... డా, ఇబ్రహీంపటం, భోనగిరి పట్టణ ... అమీర్లు బంగ్లాలు తోటలు నిర్మించిరి. నూతనముగా నిర్మాణమైన చార్‌కమానుల మధ్యనున్న నగరానికి భాగమతి జ్ఞాపకార్థము "భాగ్యనగరము" అను నామకరణము కావింపబడెను

ఈ నగరములో పట్టీలు పన్నులువిధించుట నాలుగు లక్షల హొన్నులవరకు వసూలుకావచ్చెను. ఈ పన్నులనుండియే బీదలకు అన్నదానమునకై ౧౫ వేలహొన్నులను ౬౦ హొన్నులు లంగరుఖర్చునకు తక్కిన మొత్తము మౌల్వీలకును పంచిపెట్టబడుచుండెను. గోలకొండ పాదుషాలు షియ్యా మతస్థులు. అట్లున్నను ఈపాదుషా ఎవరైతే హజరత్ పైగంబర్ మహమ్మద్ రసూలుగారి ముగ్గురు అనుయాయలను (తబ్రాపాడి) నిందింతురో వారినాలుకలను కోయింతునని ఆజ్ఞయిచ్చెను

అయితే యీఆజ్ఞను రనకే మనుసుకువచ్చి చేయలేదు. అప్పుడు ఢిల్లీలో చక్రవర్తియైన జహాంగీరు ఇచ్చటి షియ్యాలఆచరలనువిని వెంటనే తబ్రాను మాన్పింతువాలేదా అని బెదరించెను అందుచేత తబ్రా నిలచిపోయెను. జహాంగీరు కోపశాంతికై మంచిమంచి నజరానాలు కూడా పంపుకోబడెను

### మక్కామసీదు

౧౦౨౦ మహమ్మదు ఖులీ ఖుతుబుషా చనిపోయెను. అతనికుమారుడు సుల్తాన్ మహమ్మదు ఖుతుబుషా రాజయ్యెను అతడు తనకాలములో చారుమినారు సమీపంలో మక్కామసీదునుకట్టించెను. దీని శంకుస్థాపనకథ చాల రమ్యముగానున్నది. ౧౦౨౨ హిజిరీలో శాస్త్రిములోని మౌల్వీలను, ఫకీర్లను, అరబిపండితులను పిలిపించి వారిసమక్షములో నిల్చునిలపిచ్చెను "మీలో ఎవరైతే ఎన్నడుగాని తప్పకుండా దినమూ అయిదుమారులు నమాజు చేసినారో అట్టివారు దీని శంకుస్థాపన చేయవలసినది" అండరూ ఒకరిమొగముఒకరు చూచుకొన్నారు. అప్పుడు పాదుషా తానే శంకుస్థాపనకై మొదటిరాతిని పాదుకొలిపినాడు. అంటే ఆయన నమాజు తప్పని మతాభిమానిఅని తెలిపోయింది. ఆయనకాలములో ఈమసీదుకు గాను ౭౦ వేల హొన్నులు వ్యయముచేసినాడు. పనిచాలా చిన్నగా సాగుతూవచ్చింది. ఆయన కాలములో అదిపూర్తికాలేదు. తర్వాత అబుల్‌హసన్ తానాషాకాలములోకూడ నిర్మాణము జరుగుతూ వచ్చెను. అప్పటికిని పైకప్పు పూర్తి అయ్యేనే కాని దానిపై మీనారులు ప్రారంభమేకాలేదు తర్వాత ఆతనికి పతనముకలిగెను. ఆలంగీరు పాదుషా గోలకొండరాజ్యాన్ని వశపరచుకొనెను. అతడును ఇంతగొప్పమసీదుకు మీనారులు ముఖ్యమనవి కట్టించుట సాధ్యముకాదని అక్కడికక్కడికే పూర్తిచేయించి ముగించెను. ఇట్లు ౧౦౨౨ హిజిరీలో మొదలైన యీమక్కామసీదు ౧౧౦౪ హిజిరీలో పూర్తియయ్యెను. అనగా ఇంచుమించు ఒకశతాబ్దముపట్టెను, ఇప్పటికిని హైద్రాబాదు రాష్ట్రములో మక్కామసీదును మించిన మసీదు లేనేలేదు

### లింగంపల్లిబాగ్-

సుల్తాన్ మహమ్మదుఖుతుబ్షా చచ్చెను. అతని కుమారుడు అబ్దుల్లాఖుతుబుషాఅనువాడు రాజ్యానికివచ్చెను. అతడు రంగీలారాజా విలాసపురుషుడు. స్త్రీలోలుడు. విషయాసక్తుడు. అందుచేతనే అతడు తన వాహ్యాళివిహారాలకుగాను లింగంపల్లిలో పెద్ద ఉద్యానవనమును పెంచెను దానినే యిప్పటికిని "బాగ్‌లింగంపల్లి" అనియందురు.

### గోషామహల్

అతడే తనవినోదాలకు తాను నిర్మించినవటితో తృప్తిపడక "గోషామహల్" కట్టించెను. అచ్చట ఒక పెద్దహౌజుకట్టించెను. దానిచిహ్నలిప్పటికిని గోషామహల్‌లోకలవు. దానిచుట్టును ఒకవేయి పెద్దగదులు కట్టించెను: ఈ పాదుషా చీనాదేశమునుండి చిత్రకారులనుపిలిపించి పాహీఅషుర్ఖానాలో రంగుల చిత్రాలు వ్రాయించెను. ఇతడు తనకాలములో ఒకఆజ్ఞను తనరాజ్యములోకావించెను. పీర్లపండుగ కాలములో రాజ్యమందెచ్చటను దేవిడీలలో నగారాలు మ్రోయించకూడదనిన్నీ తమలపాకులు, మాంసము ఎవ్వరును అమ్మకూడదనిన్నీ అమీరుకానీ ఫకీరుకానీ ఆనందాలన్నింటిని కట్టిపెట్టవలెననిన్నీ హిందువులకును ముసల్మానులకును ఈ యాజ్ఞ వర్తించుననిన్నీ ఫర్మాను ఇచ్చెను.

### లంగర్

మొహర్రం (పీర్ల) పండుగలో అంపేండ్లక్రిందటివరకు అయిదవ దినమునాడు హైద్రాబాదు నగరములో లంగర్ అనుఉత్సవము ప్రచండవైభవముతో జరుగుచుండెను. దీని యుత్పత్తిక్రమము రమ్యముగానున్నది. సుల్తాన్ అబ్దుల్లాఖుతుబ్‌షా ఒకనాడు ఏనుగపైనెక్కి వాహ్యాళి వెళ్లుచుండెను. అంతలో ఏనుగుకుమద మెక్కెను. అది చుట్టుపట్టువారిని చెదరగొట్టి ఒకేపరుగున అడవిమార్గముపట్టెను. ఈవార్త సుల్తానుతల్లియైన హయాతుబక్షీ బేగంకు తెలియగానే ఆమె ఏడ్చుచూకూర్చుని తుదకు హజరత్ ఇమాంహుసేను తలచుకొని"నాకొడుకు క్షేమముగా తిరిగివచ్చినట్టయితే బంగారుగొలుసు సిద్ధము చేయించి నా కొడుకు నడుమునకుమట్టి లంగర్ వెళ్ళింతును. తర్వాత దానిని ఫకీర్లకుపంచిపెట్టుదు"ను అని మొక్కుకొనెను. దైవము ఆమెప్రార్థనను వినెనోయేమో అన్నట్లుగానే ఏనుగుపట్టుబడెను. పాదుషాక్షేమముగా దేవిడీకివచ్చిచేరెను. ఆదేక్షణమందే రాత్రియనక పగలనక కంసాలులనుపిలిపించి బేగంగారు ౧౨మణుగుల బంగారుగొలుసును సిద్ధము చేయించి పాదుషా నడుమునకుచుట్టి జులూసు వెళ్ళించి హుసేనీ ఆలంవద్దకుపంపెను. అప్పటినుండియు ఈలంగరు ఏటేటచేయుట పరిపాటి అయ్యెను.

### మీరాలంచెరువు

హైద్రాబాదునగరములో హుసేన్‌సాగరు తర్వాత (ఉస్మాన్‌సాగరుకట్టకపూర్వమువరకు) మీరాలంచెరువు చాలప్రసిద్ధినొందినట్టిది.

నవాబ్ సికిందర్‌జా (అసఫ్‌జాహీవంశపు నవాబు) ౧౨౨౭హిజిరీలో హైద్రాబాదు రాజ్యానికివచ్చెను. ౧౨౨౯హిజ్రీలో మీరాలం అతని మంత్రియయ్యెను, అతడు నాలుగేండ్లు మంత్రిత్వమునిర్వహించి మరణించెను. అతనికాలములోనే అతనిపేరట మీరాలంచెరువు కట్టబడెను. దానికిగాను మూడులక్షలరూపాయీలు ఖర్చుపెట్టెను. మూసీనదీతీరములో బారాదరీతోటకూడ అతడే వేయించెను మీరాలంమండి (దీనినే పాదురులు మిరియాలమండి అనియందురు) అను వదియు వీరేయేర్పాటుచేయించిరి. ఇప్పటికిని అచ్చట కూరగాయలు అమ్మబడుచుండును

### చాదర్ ఘాట్ వారధి

౧౨౪౭హిజిరీలో నవాబు నాసిరుద్దౌలాకాలములో చాదర్‌ఘాటువారధి కట్టబడెను దానికై సుమారు ౩౦వేల రూపాయీలు వ్యయమయ్యెను.

మూసీనది ౧౯౧౫క్రీ.శ.లో గట్లు తెగపారి నగరములో గొప్పనష్టముకలిగించినది యిప్పటికా లమువారికందరికిని తెలియును పూర్వము౧౦౫౪హిజిరీలో అనగా ౧౧౩ఏండ్లక్రిందటఒకమారిట్లే మూసీనది ప్రవహించియుండెను. అప్పుడు పురానాపుల్ కొంతభాగము ఎగిరిపోయెను. ఘాసిమియాబజారున్న సిద్దిఅంబరుబజారున్న దీని పరిసరప్రదేశాలున్ను నదిలోనినీటిచే మునిగిపోయి చాల నష్టమయ్యెను.

ఈవిధముగా హైద్రాబాదునగరములో ప్రసిద్ధమైన స్థలము లేర్పడుచువచ్చెను

---

# పిల్లల పాఠపుస్తకాల సొమ్ము ఉపాధ్యాయుల పాలు

జంగంపల్లివాసుల మొఱ

కామారెడ్డి తాలూకాలో చేరిన జంగంపల్లి గ్రామములో ప్రాథమికపాఠశాల గలదు. ఇచటి కి ఇదేసంవత్సరములోని ఆజూరు నెలలో మౌల్వీ హాదీహుస్సేన్ సా॥ అను పేరుగల ఒక సహాయోపాధ్యాయుడు తరక్కీపై మా గ్రామబడికి తబాదిలాఅయి వచ్చియుండిరి. కాని కొద్దికాలములోనే, అనగా బహమన్ నెలలో వీరు తనజ్జుల్ పై కల్లాడిఅను గ్రామమునకు తబాదిలాచేయబడిరి. ఈమధ్యకాలములో మా పిల్లలు వారితరగతిలో చదువుబాలురు కనుక పాఠపుస్తకములుకొని తెస్తానని మాయొద్ద పుస్తకముల వెలలు తెప్పించుకొని తనస్వంతఖర్చులలో వినియోగించుకొనెను. ఎన్ని యోసాగులు పుస్తకములు ఇమ్మన్నను ఇవ్వక పుస్తకములకుబదులు మాపిల్లలకు దండన ప్రాప్తమగుచుండెను. భయముచే మరల విచారించకపోతిమి. మాదురదృష్టవశమున ఇట్టి ఉత్తమోపాధ్యాయులవారి తబాదిలాఅయెను వారు వెళ్లునపుడును, గ్రామపు నలుగురి పెద్దమనుష్యులముందర మాపైకమువారు వాపసు ఇవ్వగలందులకు ప్రార్థింప (రా)కోడాలలోపల మనిఆర్డరుద్వారా పంపుదువని నమ్మకముగలిగించి వెళ్ళిరి, నేటివరకు పైకముబంపుట యటుండి ఎన్ని ఉత్తరములు వ్రాసినను ప్రతి దయచేయరు. ఉపాధ్యాయులు అజ్ఞానులకు జ్ఞానము ప్రసాదించువారుగదా; ప్రపంచమంతయు జ్ఞానమార్గములోనికి రావడమునకు వీరే కారకులుగనా అచ్చటితరి మావంటిపేదవారిసొమ్ము వాపసుచేయకపోవడము విచారణీయము. పైఉపాధ్యాయులవారు ఆఫీసరులవద్ద సమానులగు ఇతరఉపాధ్యాయ బృందముల వద్దను మావంటి పేదప్రజలవద్దను మర్యాదకు పాత్రులుకాగలరా! యను యంశము మమ్ముల బాధించుచున్నది.

జంగంపల్లి ౧౭-౯-౪౯.

ఇట్లు

కృష్ణారెడ్డి, ఎల్లైభూశాలు, పేరం రాజయ్య, భోయియల్లయ్య, భోయిమైసయ్య, ద॥కృష్ణారెడ్డి ద॥యెల్లైభూశాలు. నిషాన్ పేరురాజయ్య, నిషాను భోయి యల్లయ్య. నిషాన్ భోయి మైసయ్య.

# సంస్కృత పాఠశాల ఆగిపోవుట

(స్వ.వి) బాదెపల్లి, అమర్దాదు౧౫

ఇచ్చటి భాగేశ్వరదేవాలయములో బ్ర॥ శ్రీ. చింతలపల్లి రామస్వామి శాస్త్రిలుగారిచే నడిపింపబడు సంస్కృతపాఠశాల ఆగిపోయినది ఇచ్చట ౧౫మంది విద్యార్థులు ఉండిరి. ఇచ్చటి ఉపాధ్యాయులు బ్ర॥శ్రీ అలంపూరు శంకరశాస్త్రుగారు సంస్కృతము చెప్పుచుండిరి ఆగిపోవుటకు కారణమేమని అడిగి తెలుసుకొనగా శాస్త్రిగారికి జీతము సరిగ ఇవ్వక విద్యార్థులను నీళ్లుదేవుటము. పాచిపనిచేయుట మొదలగునవి జరుగుటవల్ల శాస్త్రిలవారు కోపముచే వెళ్ళిపోయినారు. తరువాత విద్యార్థులు మాకు శంకరశాస్త్రిలుఅయితే జదువగలముగాని లేనియెడల వేరేవారుచెప్పినట్లయితే చదువమని వెళ్లిపోయినారు. మూడేండ్లనుండి నడచుచున్న పాఠశాలస్థితి ఈవిధముగా మారినందులకు చాల విచారపడుచున్నాము.

# ప్రకటించబడని వ్రాతలు

ఈ క్రిందివిషయములనుగూర్చి మాకుచేరియున్న వ్రాతలను ప్రకటించజాలనందుకు విచారపడుచున్నాము:

౧ ఖమ్మంతాలూకా చిర్నోముల గ్రామ కాపురస్థుడగు ఒకరి అకాలమరణము ఇదివరకు ఇట్టి ఒకవార్త ప్రకటించబడెను.

౨ ఎంతవరకునిజమో ఈచిన్నకథ ఉత్త చెత్త.

౩ ఖమ్మంతాలూకా చిర్నోముల గ్రామకాపురస్థుడగు ఒకరి అకాలమరణమునుగూర్చిన వార్త (ఇంకొకరువ్రాసినది.

౩ చిర్నోముల గ్రామకాపురస్థుని)అకాలమరణము (ఇంకొకరు పంపినవార్త)

౪ నల్లగొండతాలూకాలో కుసుమర్తిలో కోదండరామస్వామివారి స్థాపన టి వెంకటప్పారావు, పెద గోపాలురావుగార్లు జరిపించినార నువార్త ఖండన

౫ డాకప్పగారి నరసింహగుప్తగారి అధ్యక్షతన హిందూ బాల్యవివాహ నిషేధశాసన నిరసన తీర్మానము (ఏగ్రామంలోనో)

౬ ఖమ్మంతాలూకా చిర్నోముల గ్రామవాసి అకాలమరణము (ఇంకొకరంపినవార్త)

౭ చిర్నోముల గ్రామవాసి మరణము పల్లవిపాదము ఇంకొకరంపినది.

౮ ఆర్యసమాజపు రెడ్డివర్మగారి వింతవుంతమాడపాటి హనుమంతరావుగారి బెదరింపులకు మందలింపులు (ఇక ఈ బాల్యవివాహసమర్థనపు చర్చకు సంబంధించినవార్తలనుగాని, వ్యాసములనుగాను ప్రకటించజాలము.

౯ బాలసరస్వతీ ఆంధ్రగ్రంథాలయచరిత్ర

౧౦ రింగురింగుబిళ్ల పాట.

౧౧ జనగామతాలూకాలో దేవరుప్పుల గ్రామంలో సెంబరువెయ్యన తాటిచెట్లను గీకుట సంతకము లేదు.

౧౨ సదాశివపేటలో రాత్రిగడిసిలో స్త్రీలకు దెబ్బలు (తగినసాక్ష్యము కనిపించువరకుప్రకటించబడవు)

౧౩ నేటి ప్రపంచపరిస్థితి ఈవ్యాసము నిస్సారము.

౧౪ గ్రామవిద్యాప్రచారము పద్యాలు ప్రకటించుటలేదు.

౧౫ జనగాము తాలూకా నారాయణపురంలో శూద్రజాతి అహింసాపూరిత వివాహము

౧౬ వరంగల్లు దుండగాలు.

౧౭ వరంగల్లుజిల్లా ఆత్మకూరులో హిందూ బాల్యవివాహ నిషేధశాసన నిరసనతీర్మానము.



# తావాన్ల మాఫీకై రైతుల విజ్ఞప్తి

రేపాక, ఖుర్దాదు ౧౧

ఈగ్రామము శిరిసిల్లతాలూకా, కరీంనగరం జిల్లాలో చేరినది. ఇచ్చటివారి జీవితముయొక్క వగా చెర్లుకుంటలపై యాధారపడియుండుటచే, చెరువుకుంటలకునీరు రాక వానకాలము, వేసంగిపంటలుపొత్తిగా ఫలించకపోవుటచే, ఇచ్చటివారు వలసములమాడవలసివచ్చెను. అచ్చటచ్చట వేసంగి భావిపొలములు కొద్దిగొప్పపండించుకున్నవారివద్ద అప్పురూపకముగా కొంత ధాన్యము తెచ్చుకొనివారియొక్కయు వారిభార్యా పుత్రాదులయొక్క యు జీవితముఅతికష్టతరముగా గడుపుచుండిరి.

ఇట్టివిషమపరిస్థితిలో ఈజిల్లాకుజెందిన ఏడు తాలూకాలకును, ప్రత్యేకముగా మాశిరిసిల్లాతాలూకాలోగల (౧౫౦, గ్రామములకునుకాని లేనికష్టముమాగ్రామమునకు ఖారజు భాతపగంపోకులపై తావానులుచెల్లించుటరూపమున సిద్ధమైనది. ఈబీదరైతులుఉపవాసవ్రతములుచేయుచు ప్రస్తుతపుతాబీకిస్తు చెల్లించు శక్తికి కష్టతరము గానున్నపుడు, దీనితోపాటుపైతావానులుకూడా చెల్లించుటకైపటేలుపట్వారీలు మతాలబా చేయుచుండగా ఈబీదరైతుసంఘము గడచిన ౬ అమర్దాదు సన్ ౧౩౪౯ రోజున ఇవ్వాలు తాలూకదారువద్దికి మొరపెట్టుటకై పోయిదరఖాస్తుయివ్వగా ఆట్టిదరఖాస్తు మదదుగారుగారు తీసికొని "సాలెహాలు ఈజిల్లాక్షామబాధలో చేరినందున తావానుల మాఫీవిషయం సర్కారువారి గస్తీవున్నది, కాబట్టిమీకు తావానులు మాఫీయిచ్చివసూలుమల్తవివిషయమయ్యి వ్రాయగలమని ఆజ్ఞయిచ్చినందునకొంతఉపశాంతికలిగెనని సంతోషించితిమి కానియింతవరకు వసూలుముల్తవికొరకు యేయాజ్ఞ గానిరానందున పటేలు పట్వారీల బాధయెక్కువగానున్నది. కావున ప్రస్తుతము మనవియేమన ఈబీదరైతులవద్ద తావానురకం వసూలుచేయకుండుటకై తావాన్లమాఫీచేయించి పటేలు పట్వారీలపేరఆజ్ఞముల్తవీ యివ్వగలందులకు ప్రార్థించుచున్నాము.

ఇట్లు,
ఒక రైతు

# గ్రంథాలయస్థాపన

తక్కెళ్లపాడు (మధిర తాలూకా)
అమర్దాదు ౧౦

నేటిసాయంకాలము ౩ గంటలవేళ ఈగ్రామములో కొంతమంది సభ్యులు సమావేశమై పుస్తకభాండాగారమును నెలకొల్పిదీనికి శ్రీనాగేశ్వర గ్రంథాలయముఅను నామకరణమిడిరి, మరియు ఈభాండాగారమువిషయమై కొందరు సభ్యులు గ్రామస్థులు బహునిపుణతతో వృద్ధిలోనికితేగలమనిఅభిప్రాయములు తెలిపిరి.

ఇప్పుడు ప్రస్తుతము నిలువచేయబడిన (౩౦౦) గ్రంథములకంటె కొలదినములలో యింకా చాల గ్రంథములు, కావలసినవస్తువిధానములు ఏర్పాటుచేయుఅవకాశములకైసభ్యులు తగుప్రయత్నములుచేయుచున్నారు. ఇందుముఖ్యకారకులగు మ. రా. శ్రీ బస్వరాజు వెంకటప్పారావు దేశపాండ్యా మక్తేదార్ గారు భాండాగార ఆవశ్యకతను గురించి తమ అభిప్రాయమును సుమధురవాక్యములతో తెలిపిరి.

మ. రా. శ్రీ. గుంటుపల్లి నారాయణచౌదరీగారు, మ.రా శ్రీ. శీలం వెంకటరెడ్డిగారు, యింకా కొందరుసభ్యులు ఈభాండాగారమునునిలువబెట్టి విద్యాగంధములేనిమానవులకు విద్యాగంధముయొక్క సువాసనను వ్యాపింపజేసి ఆనందతరంగములలో ఓలలాడు అవకాశముకలుగజేసినందులకు మిగుల శ్లాఘనీయులు కొలదిదినములలో ౪, ౫ వార్తాపత్రికలను తెప్పించు ఏర్పాటులు జరుగుచున్నవి.

## హరికథా కాలక్షేపములు

(స్వ వి)

జనగాము, జూను ౧౯

ఇచ్చటికి బాపట్ల వాస్తవ్యులగు సంగీతశిరోమణి హరికథాకుశలురగు అడ్డెపల్లి లక్ష్మణశాస్త్రిగారు ఇక్కడికి వచ్చియున్నారు వీరు ఇక్కడహరికథలు చాలాబాగా చెప్పుచున్నారు. వీరు శ్రీయుత ఆర్వపల్లి నారాయణగారి ఘననుంచుచెప్పనారు. మనోహరమగు గానములు వినిపించినారు అవి ప్రసంగ కరములైయున్నవి, వీరు హరిజనులవిషయం జనుల అందరికి చాలా బోధచేయుచున్నారు వీరివెంట బ్రహ్మశ్రీ పిశుపాటి పద్మనాభశాస్త్రి మృదంగం చాలాబాగా వాయించుతారు.



# అంజుమన్ తరక్కి ఉర్దూలు స్థితి

(స్వ వి)

మహబూబునగరం, అమర్దాదు ౧౫

మొన్న సాయంకాలము సుమారు ౫౦॥౫లకు ఈఅంజుమన్ గ్రంథాలయమునకు వెళ్లియుంటిని. పూర్వము నాబాల్యదశలో ఈగ్రంథాలయము కడుఉన్నతదశలోనుండెను. ప్రస్తుతమునిక్కిలి హీనదశనొందినది

ఈగ్రంథాలయపు అధ్యక్షులు అబ్దుల్లమస్తాని గారు కార్యనిర్వాహకుడు మహమ్మదు మొయిద్దీను గారు కార్యదర్శి అబ్దుల్ అజీజు తహసీల్దారు గారు, మరికొందరు సభ్యులున్నారు. మొత్తముమీద చందాదారులు (౨౦)కిలోగానేయుండవచ్చును.

ఇచ్చటికి టైమ్సుఆఫ్ఇండియా, మలిరహార్ దక్కన్ దినపత్రికలు వచ్చుచున్నవి మౌల్వీ, కామ్యాబ్ యను మాసపత్రికలు ఇతరులచేఇవ్వబడుచున్నవి కొన్నిపుస్తకాలకూడ జీర్ణస్థితిలో నుండెను. నాలుగైదు సంవత్సరముల క్రిందటిదీని ఉన్నతస్థితిని ప్రస్తుతము విచారింప నాకెసంకటమగుచున్నది.

ఈగ్రంథాలయము ప్రతిదినము ప్రొద్దున ౫॥౫ల నుండి రాత్రి ౯॥౫ల వరకు తెరచియుండును. ప్రతిరోజు ఇరువది పాఠకులకన్న ఎక్కువరారు.

మౌ॥ ... ... గారు మాత్రమే ప్రతిమాసమునకు రు ౧-౦-౦ వంతున చందాఇచ్చుచున్నారు తక్కినవారు నాలుగణాలు.

దీనియొక్క శాఖ చౌరాహాలో ఒకబండిశాలపైఏర్పాటు చేయబడియున్నది. అంజుమన్ తరక్కి ఉర్దూ జలసాల్ లను నెలకొల్పు ఏర్పాటు చేసినారు.

గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర జ్యేష్ఠ బ॥ ౭

గురువారము

# యుద్ధ సహాయ మెట్లు?

యుద్ధపరిస్థితి చాల నాజూకుస్థితి లోనికి వచ్చినదని కొందరుతలచుచున్నారు. కాని అట్టిసిస్థితిరాలేదు. బ్రిటిషుసామ్రాజ్యముసామాన్యమైనదికాదు. బ్రిటిషురాజనీతి ప్రపంచమంతటను అద్వితీయమైనది. బ్రిటిషు జాతీయగుణము అసామాన్యమైనది. ఆ జాతికికల పట్టుదల, దేశాభిమానము, ఆత్మవిశ్వాసము ప్రపంచములో మరే జాతికినిలేవు. ఈకారణములచేత బ్రిటిషు వారికే తుదివిజయమనుమాటలో మాకేమియు సందేహములేదు. "The British lose all battles except the last" ఇంగ్లీషువారు తుది యుద్ధంలో తప్ప తక్కిన యుద్ధాలలో నంతా ఓడిపోతారు" అని యెవ్వరో చమత్కారముగా చెప్పినారు. చరిత్ర చదివినవారికి ఇదే అంశమే రుజువగుచున్నది. ఈయుద్ధమొక లెక్కనా? ౧౫౦ ఏండ్ల క్రిందట నెపోలియన్ చక్రవర్తి యూరోపుఖండాన్ని ౧౫ సంవత్సరములవరకు ఏకధాటిగా గడగడలాడించెను. యూరోపునంతను తన పాదవీరముగా చేసుకొనెను. ఇంగ్లీషువారి కెవ్వరును సహాయముగా లేకుండునట్లు చేసెను, వారిపైననే తన యావచ్ఛక్తిని వినియోగించెను. అయితేమాత్ర మేమయ్యెను. తుదిలో అతడే ఓడిపోయి యింగ్లీషువారి ఖైదీఅయ్యెను. అంతదూర మెందుకు పోవలెను. ౨౫ ఏండ్లనాడు ఈజర్మనులే ౪ ఏండ్లవరకు అవిచ్ఛిన్నముగా జయాలను పొందుచూ ఇంగ్లీషువారిని ముప్పతిప్పలుపెట్టి ఒక్కటే క్షణము అమాంతముగా కూలిపడిరి. కావున మనము ఈయుద్ధములో మన ఇంగ్లీషు ప్రభువులకు ఏమగునో యేమోకదా అని బెంగపడ నవసరములేదు.

అయినా చేసేప్రయత్నము చేయవలెనుకదా, పాతచిత్రలనుచదువుకొనిన జయ మూరకనే లభించునా? హిందూస్థానప్రజలు తమ ప్రభువులయెడ తమ ధర్మాన్ని నెరవేర్చవలెను.

"మన ఇంగ్లీషుదొరలు! వీరేమంచివారు! వీరికే సహాయము చేయవలెను- "నైతికంగా," "ఆర్థికంగా" "ఆంగికంగా" అని లావులావు పదాలు పెట్టి మంచి మంచిమాటలుకూర్చి శ్రీరంగనీతులు చెప్పితే ఇంగ్లీషువారికేమిన్ని సహాయము కానేరదు. మన సికింద్రాబాదులోనున్న కుబేరుని పిల్లల ఆదర్శము చాలామంచిదిగాను ప్రశంసనీయముగాను, అనుకరణీయముగాను నున్నది. అడిగీ అడుగకమునుపే వేలువేలుగా చందాలు పడవేసినారు.

మొన్ననే మన హైదరాబాదు నాయకులు ఒక గొప్ప గంభీర ప్రకటన కావించినారు- ఆ ప్రకటనలో సంతకములుపెట్టిన నాయకులు సామాన్యులు కారు. వారు హేమాహేమీలు. ఐదుగురు ఆంధ్రమహాసభాధ్యక్షులున్నారు. వీరు౨౦లక్షల ఆంధ్రుప్రజాప్రతినిధులు. అందులో వర్తమాన సప్తమ మహాసభాధ్యక్షులున్నారు. మహారాష్ట్రమహాసభాధ్యక్షులును కర్ణాటకులకు ఆయువుపట్టు అయినవారున్నారు. అఖిలభారత రాజకీయ రంగానికెక్కుచున్న బారిస్టరుగారున్నారు. జాగీర్దారులున్నారు. కోటీశ్వరులున్నారు. వీరిలో చాలమంది యువకులే. ఇంచుమించు అందరును యుద్ధములో స్వయముగా పాల్గొనదగినవయస్సుగలవారున్నారు. ఇట్టివారు కేవలము పత్రికాప్రకటన చేసితే చాలదు. స్వయముగా విరివిగా ఇయ్యవలెను. స్వయముగా చందాల వసూళ్లకు బయలుదేరవలెను. ప్రతివారము ప్రకటనలు వెలువరించవలెను. జనులలో ప్రబోధము కలిగించవలెను. ఏమైన తప్పుడు వదంతులుంటే వాటిని వెంటనే తొలగించవలెను. ఇదంతా వీరు చేయవలెనని కోరుచున్నాము.

ఇది ప్రజల ధర్మము. ఇక బ్రిటిషువారికిని కల ఒకముఖ్య ధర్మమును గూర్చి చర్చింతము. "మాకు స్వరాజ్యమిప్పుడే ఇయ్యండి" అను వాదము మేము చేయము. అసమస్యను గొప్ప గొప్ప నాయకు లెదుర్కొనుచున్నారు. దానితో మాకిప్పుడు జోక్యములేదు. మేము సూచించునది యుద్ధమునకు సంబంధించినంతవరకే. యుద్ధములో సహాయము చేయవలెనన్న ఇప్పటిస్థితిలో ఇండియా ఏమిన్ని చేయజాలనిదై యున్నది. ఎంత చందా యిచ్చినను సంవత్సరముపొడుగున ఇచ్చినను యుద్ధములో ఒక దినముఖర్చుకూడ యావద్భారతమియ్యజాలదు. (ఇప్పుడు ఇంగ్లీషువారికి ప్రతిదినము ౧౫ కోట్ల రూపాయిలు యుద్ధానికై ఖర్చగుచున్నవి.) మరి ఈ భారతదేశంలో ౪౦ కోట్లమంది ఉన్నారుకాని ౪౦ కోట్లగొర్రెలు ఒక సింహాన్ని ఎదిరించలేవుకదా. ఆయుధశాసనముద్వారా భారతీయులకు తుపాకిమెట్లు పట్టుకోవలెనో తెలియదు. పైగా బ్రిటిషువారింకను గతకాలపు అభిప్రాయాలకులోనై యున్నారు. పూర్వకాలములో కత్తులతో ప్రధానంగా యుద్ధచేసే కాలములో ఇది వీరజాతి ఇది పిరికిజాతి అనేవిచక్షణ వెంటనే కనబడుచుండెను. ఇప్పుడో యంత్రాలకాలము. బాంబుల కాలము. ఒకపిల్లవాడు తుపాకి యంత్రము చేతబట్టుకొని, యేమూలనో, యెంతదూరాననో దాగి యేనుగంతటి మనిషిని కనురెప్పపాటులో చంపి సున్నము చేయవచ్చును. ఇప్పుడు వీరజాతియేది పిరికిజాతియేది అందరును ఒకటే. కావున మిలిటరీలో అన్నిజాతులను అన్ని భాగాలలోనున్న జనులను తీసుకొనవలెను. భారతీయులకు అందరకిని అనగా ఆరోగ్యవంతులైన ౧౮ ఏండ్లనుండి ౪౦ సంవత్సరాలలోపలి మగవారి కందరకిని నిర్బంధ సైనిక శిక్షణ యెందుకియ్యరాదు. అందుకు భారతీయులు సంతోషముగా నొప్పుకొందురు. అట్లుచేసిన అరువదిసా(లలో) ఎన్నికోట్లసైన్యము సిద్ధముకాగలదో చూడుడు. అప్పుడు దేశరక్షణలో ఏమియు చింతింప నవసరములేదు. భారతీయులెట్లు ఇంగ్లీషువారిని ప్రేమింతురో ఇంగ్లీషువారట్లు భారతీయులను విశ్వసించవలెను. పరస్పరవిశ్వాసములేనిది ఈ సమయములో యేమిన్ని పని ముందుకు సాగనేరదు.

మేమాలోచించిన రెండు విషయాలను దేశీయనాయకులును బ్రిటిషు ప్రభుత్వమువారును ఆచరించితే ఎంతో బాగుండునని మాకు తోచిన వరకు సద్భావముతో మనవి చేసుకొన్నాము.

## రుమేనియా ద్రోహము

జర్మనీదేశానికి ప్రక్కదేశమే రుమేనియాదేశము. దానిరాజుపేరు కెరోల్ రాజు. ఈరుమేనియాదేశాన్ని జర్మనీ యెప్పుడో మింగివేస్తుంది అని వదంతులు ఉండినవి. గతవారము రుమేనియాలో రాజకీయపార్టీలన్నీ ఒకటిగాచేసి కెరోల్ రాజు సర్వాధిపత్యము వహించినాడు. "ఇకముందుకు మాదేశం జర్మనీ ఇటలీ వారితో కలిసియుండును." అని ఆ దేశ పత్రికలు సూచనలుగా వ్రాసియున్నవి.

ఇదివరలో బ్రిటిషువారున్ను, ఫ్రెంచివారున్ను రుమేనియాకు అభయమిచ్చియుండిరి. ఎవరున్నూ రుమేనియాపై దండయాత్రచేయకుండా సాయపడుతామని వాగ్దత్తము చేసియుండిరి. కాని కాలపరిస్థితులుచూచుకొని రుమేనియా రాజు ఇప్పుడు పల్టీకొట్టుతున్నట్లు కానవచ్చుచున్నది. రుమేనియాదేశములో పెట్రోలు సమృద్ధిగా లభించుతూఉన్నది. యుద్ధానికిపూర్వము విశేషముగా జర్మనీవారే అనూనెను కొంటూఉండిరి. కాని యుద్ధమువచ్చినతర్వాత రుమేనియాకు బలవంతుల బెదరింపులు మీరరానివయ్యెను. ఉభయదేశాలవారును బలవంతులే. ఎవరికి పెట్రోలు సప్లై చేసినను ఇంకొకరికి కోపమువచ్చును. ఉభయులను రుమేనియాను బెదరించేవారే. ఇంతేకాక గత ౧౯౧౪—౧౮ యుద్ధములో రుమేనియాకు కొంత దేశాన్ని "బెస్సరేబియా" అనుభాగాన్ని రష్యానుండిగుంజి యిప్పించియుండిరి. అంతేకాకుండా హంగెరీ, బల్గేరియా దేశాలవారున్నూ తమతమ దేశభాగాలు కొన్ని రుమేనియాలో చేరినవనిన్నీ అవి తమకు సక్రమంగా తిరిగియియ్యవలసి యుంటుందనిన్నీ అప్పుడప్పుడు సమయముకొద్ది బెదరించుచుండేవారు.

ఇవన్నీ యిట్లుండగా చాలామంది జర్మనులు రుమేనియాలో నున్నారు. ప్రక్కదేశమే యగుటచేత సహజంగా సరిహద్దులో జర్మనులే అధికముగాఉన్నారు. మరియు ప్రధాననగరములోకూడ జర్మనులు ప్రాధాన్యతవహించి తమ నాజీ కుట్రలను మెల్లప్పటికి చేయుచునేయుండిరి. "ఐరన్‌గార్డు" అను సంఘమువారు నాజీ అనుయాయులు. వీరు గత సంవత్సరమే కొన్నికల్లోలములనుచేసిరి. కెరోల్ రాజు ధైర్య సాహసాలతో వారి దౌర్జన్యాన్ని తాత్కాలికంగా అణచివేసెను. ఇట్టిసన్నివేశములో రుమేనియా దేశము జర్మనీపక్షంవహించుట ఒకవిధంగా ఇంగ్లీషువారికి ద్రోహముచేయుట యగును. ఇంగ్లీషువారు సర్వవిధాలా రుమేనియాకు ఇబ్బందిలేకుండా చూచుకొందుము అని మాటయిచ్చినను నిష్కారణంగా వారికి ప్రబలశత్రువువైన జర్మనీపక్షము వహించుట దుష్టనీతిగా ఉన్నది. ఫ్రాన్సులొంగిపోవుటచేత "జర్మనీదే గెలిచేపక్షం. జర్మనీకి విరుద్ధంగావెళ్లితే నాశనం ఔతాము. ఎవరు బలవంతులో వారిపక్షం ఉండడమే క్షేమం" అనే కుతర్కంలో రుమేనియాపడినట్లు కానవచ్చుచున్నది. ఎట్లైతేనేమి తాత్కాలికంగా ఈద్రోహంవల్ల జర్మనీకి పెట్రోల్ సప్లై జరిగి లాభంకలుగుతుంది అనేది నిజమే. కాని యిట్టి పెన్నాళ్లు జరుగగలవు? అనునదే ప్రశ్న. జర్మనీభయముతో స్నేహితులగువారు ఎంతకాలమాస్నేహాన్ని నిలబెట్టుకొనగలరు? ఎప్పుడు జర్మనీ పతనమారంభమగునో అప్పుడివన్నియుకూడ కూలిపడును.

## అలియాబాదు ఆర్యసమాజోత్సవము

బాల్యవివాహ నిషేధమును తీర్మానించుట

హైదరాబాదు (దక్కన్) అలియాబాద ఆర్యసమాజ ౭వ వార్షికోత్సవము ౯ అమర్దాను సన్ ౧౩౪౯ ఫ. శుక్రవారంరోజున అలియాబాద వెలుపల, గొల్లగూడెంవీధిలో మహావైభవముగా జరిగెను. ప్రాతఃకాలము కార్యక్రమానుసారము ౨ గంటలకు హవనముజరిగెను. తదుపరి "ఓం" ధ్వజారోహణము జరిగెను. శ్రీమాన్ పండిత హకీం గణపతిరావుగారు, వారి ధర్మపత్నితో సహా నెరవేర్చిరి. ధ్వజారోహణము జరిగినపిదప భజనశ్రవణముజరిగెను. అందులో శ్రీమాన్, పండిత మహేంద్రప్రతాప శాస్త్రిగారి మనోహర ఉపదేశములుండెను. తదుపరి ప్రాతఃకాలకార్యక్రమము ౧౧గంటలకు శాంతిపాఠముతో సమాప్తిచేయబడెను.

సాయంకాల కార్యక్రమము ౯గంటలనుండి ప్రారంభముచేయబడెను. మొదలు శ్రీశ్రీశ్రీనిజాం ప్రభువుగారి ఫొటోపతమునకు ప్రజల కరతాళధ్వనులమధ్య పుష్పమాల వేయబడెను. తదుపరి సంధ్యాప్రార్థన జరిగినపిదప శ్రీమతి శాంతిదేవిగారు తెలుగులో బాల్యవివాహమును గూర్చి, మరియు స్త్రీజాతి ఉన్నతినిగూర్చి వ్యాఖ్యానము చేసిరి తదుపరి శ్రీమాన్ బాలాప్రసాద్ ప్రధానిగారి ప్రార్థనచే హృదయసామ్రాట్ పండిత నరేంద్రగారు వ్యాఖ్యానము జరుపుచు ఆర్యసమాజము అలియాబాదతరఫునుండి బాల్యవివాహ శాసనముకొరకై ఒకతీర్మానముపెట్టిరి. ఈ తీర్మానము శ్రీమాన్ బాలయ్య, బి. ఏ గారు అమోదించిరి. ఈతీర్మానమును సుమారు ౨౫౦౦ప్రజలు ఒప్పుకొనిరి తదుపరి శ్రీమాన్ పండిత ఆతదబహారిలాలుగారు బాల్యవివాహము ధర్మశాస్త్రములకును, వేదములకును సమ్మతిలేదనుచు ఉత్సాహముతో చెప్పిరి.

ఈ వ్యాఖ్యానముపిదప శ్రీమాన్ పండిత మహేంద్రప్రతాపగారు గృహస్థాశ్రమమును గూర్చి ఉపన్యసించిరి తదుపరి శ్రీమాన్ పండిత బుద్ధదేవు విద్యాలంకార్ (శాస్త్రార్థమహర్షి) గారు హిందువుల మతమును గూర్చి ఉపన్యసించిరి.

## బాలికా పాఠశాల

ప్రభుత్వానికి వినతి

బీబీనగరము, ౨౨ జూను

"నేను యిక్కడికి నేడు ౧౫౧౦కివచ్చి కొందరియువకసోదరులను చూచినాను, వారు యిక్కడ సుమారు ఆరుమాసములనుండి ఆంధ్రయువకసంఘ పక్షమున నడుపబడుచున్న బాలికల పాఠశాలను నాకు చూపించినారు. ఈ పాఠశాలలో ౩౫మందికి మించినసంఖ్యగల విద్యార్థినులు సక్రమముగా విద్యాభ్యాసము చేయుచున్నారు. ఇప్పటికే మూడవతరగతి పాఠములుచదువుచున్న చిన్నచిన్న విద్యార్థినులు చూచువారికి ఆనందము గొలుపుచున్నారు. విద్యార్థినులకు నవీన పద్ధతులపై బోధించుచుండుటచే ఉపాధ్యాయినిగారు ప్రశంసాపాత్రులు ఉపాధ్యాయినిగారు మంచి విద్యావతులగుటచే యిక్కడి విద్యార్థినులు అచిరకాలములోనే బాగుగా చదువుకొన్నవారు కాగలరని నాదృఢవిశ్వాసము.

యువజనసంఘమువారు యీపాఠశాలకు ప్రభుత్వమువారు సహాయము చేయవలెనని వినతిపత్రములు పంపుచున్నారు. ప్రభుత్వమువారు యిట్టి సముద్యమమును తప్పక ప్రోత్సహింతురు గాక యువకసంఘమువారి పట్టుదల, మరియు కార్యదీక్ష చాల కొనియాడదగినవి."

ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి.

## మా మనవి

బుధవారము ౨౬ జూన్ నాడు మావీధిలోని ఎలెక్ట్రిక్ తంతీలు కాలి గురువారము ౫ గంటలు సాయంకాలమువరకు విద్యుచ్ఛక్తివారి రిపేరీలోనే యుండినందున పత్రిక అచ్చువేయుటలో ఒకదినము ఆలస్యమైనది. అది మావశము లోలేని యంశమగుటచే ఆలస్యకారణమును పాఠకులకు తెలుపుకొనవైనది.

గో. ప. సం.

## యుద్ధకాలపుచర్యలు

రాజద్రోహపునేరము

కాన్పూరు, జూను ౨౧

రాజద్రోహమును బోధించినందుకు కాన్పూరు మజ్దూరుసభ అధ్యక్షుడు యస్-యస్-యూసుఫుగారు ౩౦౦౦ రూపాయలకు స్వంతబాండును వ్రాయవలెను. చెరి ౩౦౦౦ లకుఇద్దరిని జామీనియ్యవలెను అని మేజిస్ట్రేటు ఆజ్ఞాపించెను యూసుఫుగారు ఆప్రకారం బాండువ్రాసి, యిద్దరిని జామీనుఇచ్చిరి.

ఆసామువుండితేవముట

కలకత్తా, జూను ౨౧

దిబ్రఘడులో అస్సాంరైల్వే (ట్రేడింగుకంపెనీ కార్మికసంఘం కార్యదర్శి అబానీచరణసేనుగారు ఆసామురాష్ట్రంలో యెక్కడ నివసించకూడదని దొరతనంవారాజ్ఞాపించిరి.

కలకత్తాలో కమ్యూనిస్టులఅరెస్టులు

కలకత్తా, జూన్ ౨౧

కలకత్తాపోలీసులు సేరుఉదయము ౧౦, ౧౨ యిండ్లు సోదాచేసి కొన్ని కమ్యూనిష్టుపత్రములు పట్టుకొనిపోయిరి. ముగ్గురు అరెస్టుచేయబడిరి.

కార్మికుని అరెస్టు

నాగపూరులో చేత్మల్ అను కార్మికుని దేశరక్షణ నియమావళిక్రింద అరెస్టుచేసినారు.

## వైస్రాయిగారికి మరికొన్ని అధికారాలు

పార్లమెంటులో ఇండియామంత్రియైన అమెరీగారు ౨౫ జూన్ నాడు భారతదేశ వైస్రాయిగారికిని, బర్మాగవర్నరుకును రోడ్లలో, తంతులలో ఆటంకాలు ఎవరైనా కలిగించితే అందుతో సంబంధములో లగినపుడు అక్కడనుండి ఆజ్ఞలు అందజాలవు కనుక స్వతంత్రంగా వ్యవహరించేటందుకు, ఆపరమగు అధికారాలిచ్చుటకై ఒక సవరణశాసనము ప్రవేశపెట్టినారని తెలియుచున్నది. వివరాలింకను తెలియవు.

## విఠలదాసుకు జమానతు

హైదరాబాదు(దక్కన్), అమర్దాదు ౨౦

బిదరుతల్లరులలో తుపాకితో కాల్చినట్టి బ్రిజపాలు అనువానికి తనయింటిలో ఆశ్రయమిచ్చియుండెనని విఠల్‌దాసుఅను మార్వాడీధనికుని రిమాండుకెయిలో పెట్టియుండిరి. అప్పటినుండియు అతడు జమానతుపై విడుదలయగుటకై చాలాప్రయత్నాలుచేసి తుదకు మొన్న హైకోర్టులో అతనివద్ద ౧౦వేలరూపాయిల జమానతుతీసుకొని జమానతుపై వదలిపెట్టవలెనని హైదరాబాదు హైకోర్టులో తీర్పుఅయ్యెను విఠలదాసుపై నూరు నేరములు మోపబడెను. బిదరులో ౪ అమర్దాదునాడు జమానతుకై ప్రయత్నించగా నిందితుని వదలిన సాక్షులను తల్లక్రిందుచేయును అని పోలీసులు ఆక్షేపించియుండిరి. గుల్బర్గాలో పోలీసుసాక్ష్యము ముగిసెను. ఇప్పుడైనా వదలిపెట్టండి అని మరల ప్రయత్నముజరిగెను. కాని విఫలమయ్యెను. ఉన్నత న్యాయస్థానమువారు గుల్బర్గాన్యాయాధికారి జమానతును తిరస్కరించుటకు కారణమేమో వ్రాయకపోయెననియు, ఇప్పుడు పోలీసుసాక్ష్యమంతా పూర్తి అయినందున ఇక సాక్షులపై తనప్రభావము చేయజాలడనియు నిందితుడు పారిపోవుటకు తగిన కారణాలుకూడాలేవనియు కారణాలు చూపించుచు హైకోర్టువారు జమానతుపై విడుదలచేయుట కాజ్ఞయిచ్చిరి.

## బిదరు ఖూనీ విచారణ

హైదరాబాదు (దక్కన్) అమర్దాదు ౧౯

పైవిచారణ గుల్బర్గాలో జరుగుచున్నది. బ్రిజిపాల్ మానిక్, విఠల్ అను నిందితులపై బిదరులో జరిగిన ఖూనీవిషయములో విచారణ జరుగుచున్నది. ఈతడవ నిందితుల పక్షాన పోలీసువారిప్పించిన శిగురిసాక్ష్యాలపై అడ్డసవాళ్లు వేయబడెను. చాంద్‌సాబు అనునతడు బ్రిజిపాలు సాలార్ అనువానిని తుపాకితో కాల్చుటను తర్వాత పారిపోవుటను, విఠల్‌దాసుయింట్లో జొరబడుటను, విఠల్‌దాసు తలుపుమూసి గడియవేసుకొనుటను చూచితినని చెప్పెను.

సయ్యదుఇస్మాయిల్ అనువానిపై అడ్డుసవాళ్ళు వేయబడెను. తాను బ్రిజిపాలుచేతిలో లాఠిని లాగుకొంటిననియు దానిని తర్వాత పోలీసులకిచ్చితిననియు చెప్పెను.

తర్వాత గౌసుఖాన్ అనువానిపై అడ్డసవాళ్ళువేయబడెను. యింతకుపూర్వ మితని సాక్ష్యమున్ను అడ్డసవాళ్ళ సాక్ష్యమున్ను అయియుండెను. ఇదిరెండవమారు. మొదటిసాక్ష్యమతనికివినిపించగా అందులో విఠల్‌దాసు తన యింట్లోకి వెడలిపోయెననియు తర్వాత బ్రిజిపాలు తుపాకితో సాలారును కాల్చినతర్వాత విఠల్‌దాసు యింటిలోనికి పోయెననియు చెప్పినభాగము సరిగాదు. దాన్ని సవరించవలెనుఅని కోరుచుకొనెను. అస్సలుసంగతేమో మొదలు బ్రిజిపాలే పోయెననియు తర్వాతనే విఠల్ పోయెననియు ఉండవలెనుఅని చెప్పెను. దానిపై అతనిపైన ప్రశ్నలవర్షము కురిసెను. మొదలెందుకు సవరించలేదు, నిన్న నీకు చదివివినిపించినప్పుడు ఎందుకు సవరించమనలేదు అనిఅడుగగా నాకు చదివివినిపించలేదుఅని అబద్ధముచెప్పెను, న్యాయాధికారి యీసాక్షి అబద్ధముచెప్పుచున్నాడు అని వ్రాసుకొనెను. సాక్ష్యము పూర్తిఅయినతర్వాత విఠల్‌దాసువకీలు విఠల్‌దాసును జమానత్ పై వదలవలెనుఅని విన్నతిపెట్టుకొనెను మరల అవినతి కొట్టివేయబడెను.

---

## సికింద్రాబాదు యుద్ధ సమితిచందాలు

సికింద్రాబాదు (దక్కన్) అమర్దాదు ౧౯

౨౮ ఖుర్దాదు జిల్లా మెజస్ట్రేట్‌గారి యాజమాన్యములో సికింద్రాబాదు యుద్ధకమిటీ సమావేశమయ్యెను మంచిమంచికోటీశ్వర్లు లక్షాధిపతులు, వకీళ్లు, కోమట్లుసభనలంకరించిరి యీక్రిందివారీక్రిందివిధముగా చందాలువేసిరి.

రాజా పన్నాలాల్ బన్సీలాల్‌గారు ౨౦౦౦౦ రాజాగోవర్ధన్‌లాల్ బన్సీలాల్‌గారు ౨౦౦౦౦, రాజా శ్రీకిషన్‌సుఖదేవుగారు ౫౦౦౦. శ్రీగంగాభిషన్‌గారు ౫౦౦౦, యస్. రాజేశ్వర్‌రావు గారు ౫౦౦౦. యస్.బి. చినాయిగారు ౩౦౦౦, చీనాయి భార్యగారు ౨౦౦౦, చీనాయిభార్యగారు ౨౦౦౦, పొద్దుటూరి వీరన్నగారు ౫౦౦౦, ఏ. వేణుగోపాలుగారు ౧౫౦౦, ఎ. వి. టి. మొదలియార్‌గారు ౧౦౦౦, ఏ. రామస్వామి అయ్యంగార్‌గారు ౫౦౦౦.

---

## శ్రీమదుభయవేదాన్తవర్ధనీ సంస్కృత పాఠశాల

సీతారాంబాగు హైదరాబాదుదక్కన్

పైపాఠశాలను ౧౦ సంవత్సరము గా శ్రీమాన్ కోయిల్ కందాడై శ్రీశఠగోప రామానుజాచార్యస్వామివారు స్థాపించి ౫ సంవత్సరములుగా మదరాసు యూనివర్సిటీ పరీక్ష కనుకూలముగా, తర్క-వ్యాకరణ వేదాన్త సాహిత్యాది గ్రంథములను శిరోమణిపద్ధతులప్రకారం పాఠక్రమములు జరిపించుచున్నారు ఈసంవత్సరం వేదాన్తశిరోమణి పరీక్షలో ౪౨౨మరియు౪౨౭ నెంబర్లుగల అమరవాది వెంకట నరసింహాచార్యులు, చిక్కుడుగాయల రంగాచార్యులుగార్లు ఉత్తీర్ణులైయున్నారు. మాపాఠశాలలో శాస్త్రాభ్యాసము చేయుటకువచ్చిన విద్యార్థులకు ౧౦ మందికి బోర్డింగులో అవకాశముగలదు. ఇందు వర్ణాశ్రమానుకూల సనాతనపద్ధతులప్రకారం ప్రతివారువిద్యాలాభమును పొందవచ్చును. ఇందులో చేరదలచిన విద్యార్థులు జ్యేష్ఠబ౧౫ వరకు దరఖాస్తును బంపి మా నియమావళిని తెలుసుకొనవచ్చును విద్యార్థులు అలశించక త్వరపడగలరని కోరుచున్నాడను.

ఇట్లు

గొబ్బూరు నరసింహాచార్యులు

(కార్యదర్శి)

---

## హైద్రాబాదు నాయకులు- యుద్ధసహాయార్థమై ప్రబోధము

ఈ క్రింది ప్రజానాయకులు యుద్ధసహాయము చేయవలసినదని ప్రజలకుద్బోధన చేయుచు గతవారము పత్రికాప్రకటనము గావించియున్నారు.

నాయకులపేర్లు

౧ రాజాపన్నాలాలు బన్సీలాల్ ౨ మాడపాటి హనుమంతరావు ; బంకటలాల్ బద్రూకా ౪ అబ్దుల్లాసాహెబ్ ౫ మందుముల నరసింగరావు ౬ బూర్గుల రామకృష్ణారావు బి ఏ ఎల్ ఎల్. బి ౭ వినాయకరావు బారిష్టరు ౮ శ్రీనివాసరావుశర్మ ౯ రామాచారివకీలు ౧౦ మందుముల రామచంద్రరావు(సప్తమాంధ్ర మహాసభాధ్యక్షులు)౧౧ మీర్ అక్బరలీఖాన్ బ్యారిస్టరు ౧౨ శ్రీధర్ నాయక్ ౧౩ వెంకటరంగారెడ్డి

నాయకుల ఉద్బోధ

ఇదివరలో ఇండియాకు అపాయం అపాయమని అస్పష్టంగా బెదరుకలుగుచుండెను. ఇప్పుడు విషయం మరింతస్పష్టంగా కనిపించుతూ ఉంది. ఈ యుద్ధఘోరాలనుండి హిందూస్థానాన్ని రక్షించుమని దేవున్ని మేము సట్టుగా ప్రార్థించుచున్నాము. అయితే యెట్టిస్థితికైనా మనం సిద్ధంగా ఉండవలసియున్నది. మనలో కొన్నిముఖ్యవిషయాలలో భేదాభిప్రాయాలుండేది నిజమే. అయితే శ్రీ మ-ఘు-వ- మన ప్రభువులుంగారు సెలవిచ్చినట్లుగా పరస్పరము కీచకీచలాడుటకు ఇది సమయంకాదు ప్రస్తుతము మన రాజకీయా దర్శాలలో సమానాభిప్రాయాన్ని పొందజాలము. అయితే ఇన్ని భేదాలున్నా దేశరక్షణానికి మనమంతా ఒకటి అయ్యేదానికి ఏమి అభ్యంతరమున్నది. కావున మా దేశసోదరులంతా ద్రవ్యమూలకముగా, నైతికముగా, శారీరకముగా, సహాయంచేసి ప్రభుత్వమువారు చేయుచున్నయుద్ధసహాయానికి తోడ్పడవలెనని కోరుచున్నాము.

సాహుకార్లతో ముఖ్యమైనమనవియేమంటే వారు పట్టివదంతులకు బెదరిపోకుందురు గాక. మహాత్మా గాంధీగారిబోధ ననుసరించి వారుతమవ్యవహారాలను యథాప్రకారము శాంతముగా నెమ్మదిగా చేసుకొనుచుండగలరు. బెంకునుండి ద్రవ్యము తీసుకోకుందురుగాక! నోట్లనుమార్చి రూపాయాలను అడుగకుందురుగాక. ప్రభుత్వము వారేర్పాటుచేయుచున్న రక్షకసంఘాలలో జనులు గుంపులుగుంపులుగా చేరవలెను. ప్రభుత్వమువారున్ను తాముచేయుచున్న యుద్ధప్రయత్నాలను ప్రజలకు తెలుపుచుండగలరని కోరుచున్నాము.

---

## అబ్దులజీజుమంత్రి

హైదరాబాదు (దక్కన్),అమర్దాదు ౧౯

నౌ॥ సయ్యదబ్దుల్ అజీజు న్యాయశాఖ మంత్రిగారు వ్యక్తిగతముగా రాజ్యాంగ వ్యవహార సమితి (కాన్‌స్టిట్యూషనల్ అఫేర్సుకమిటీ)లో సభ్యులుగా చేయబడినారు. ఇది ప్రధానమంత్రిగారి కోరికపై జరిగినది. అదేవిధముగా అజీజు మంత్రిగారి పర్యవేక్షణలో ప్రభుత్వప్రకటనశాఖ, ప్రెస్సుకమీషనర్ శాఖయున్ను ఉంచబడినవి.

---

## సి. రాజాజీగారి ఆగమనము

హైదరాబాదు (దక్కన్) అమర్దాదు ౧౯

భూతపూర్వ మద్రాసు ప్రధానమంత్రిగారైన సి. రాజగోపాలాచార్యులుగారు వర్ధా కాంగ్రెసుకమిటీనుండి తిరిగి మద్రాసుకు వెళ్లుచు మార్గమధ్యములో హైద్రాబాదులో మొన్న ఆదివారమునాడు దిగినారు. హైదరాబాదు వారిని మన ప్రధానమంత్రిగారగు సర్ అక్బర్ హైదరీగారు స్వాగతమిచ్చిరి ఇద్దరుకలిసి సర్ హైదరీగారిబంగ్లాకు వెళ్ళిరి. "తాము ఏవిషయములో హైద్రాబాదుకు వేంచేసినారండీ" అని ఎవ్వరో సీ రాజాజీగారిని విచారించగా "అబ్బే, ఏమిన్నీలేదు, నామిత్రులు సర్ అక్బరు హైదరీగారికి ఇటీవలనే కళత్రవియోగము కలిగినది, ఇదేబాటకదా, వెళ్లుతూ వెళ్లుతూ వారిని స్వయముగా పరామర్శించిపోదాము. అని వచ్చినాను" అని సెలవిచ్చినారట, మరల శ్రీమాన్‌గారు మరునాడే విమానములో ఎక్కి మద్రాసు చేరుకున్నారు.

---

## భోగముదాని ఖూనీ కేసు

హైదరాబాదు(దక్కన్) అమర్దాదు౧౯

వరలక్ష్మిఅను భోగముదాన్ని దిలావరున్నిసా బేగంసాహెబాగారు గొంతుపిసికి బావిలో వేయించిరను ఆరోపణలోనున్న అభియోగము ఇంకను జరుగుచున్నది. ఈతడవ మిర్జాసలీం బేగ్ అనువతనిసాక్ష్యము గైకొనబడెను. అతడు వేలిముద్రల పరీక్షలో మనగాడట, బేగంసాహెబాగారు, వరలక్ష్మి తనపిల్లనన్ని తనయింట్లోనే వదలిపెట్టి యెటకుపోయినదోయేమో మీకైతే తెలుపుకొనుచున్నాను. అని పోలీసువారికి వరలక్ష్మి బావిలో వేయబడిన మరునాడే వ్రాసియుండెను. ఆ జాబు ఆమెదేనాకాదా అక్షరాలు ఆమె అక్షరాలవలె ఉన్నవాలేనా అను విషయంలో పై సాక్ష్యము తీసుకోబడెను. సాక్షిగారు జాబు చూస్తూనే ఇదేనండీ ఆమెజాబు అని చెప్పెను. కొంత అడ్డుసవాళ్ళ పరంపర అయినతర్వాత ఆయన వాఙ్మూలం ముగిసెను,

తర్వాత శవపరీక్షచేసిన డాక్టర్ సుర్టిఆనే ఆయన సాక్ష్యము తీసుకొనబడెను. గొంతువద్ద చేతులతో పిసికిచంపి తర్వాతనే బావిలో వేసినలక్షణాలు తన శవపరీక్షలో తేలినవని సాక్ష్యమిచ్చెను. మరల కేసువిచారణ 3 జూలైకి వాయిదా వేయబడెను.

---

## సదాశివపేట

అమ్మవారి జాతర

(ఒ.వి.) సదాశివపేట, ఖుర్దాదు ౧౫.

ఇక్కడ యెప్పటివలె అమ్మవారిజాతర సల్పుటకు పోతులు మేకలు మొదలగు తగిన సన్నాహములు జరుగుచున్నవి.

సమీపంలోవుండే అత్నూరు గ్రామవాస్తవ్యులగు యీడ్గిపెద్దగౌడు తనయింట్లోఅందరు రోగపీడితులయివున్నప్పుడు దుర్గమాంబకు మ్రొక్కియుండిరట. వారు యిప్పుడు జాతరకు సహాయము నూరు రూపాయీలు విరాళము యిస్తారట. అట్టి ద్రవ్యసహాయముచేతను యింక కొందరి వద్ద భిక్షమెత్తియు యీజ్యేష్ఠమాసముకాగానే దేవికి తామసికపూజలు జాతర చేయుదురట, జీవరక్షక ప్రచారకమండలివారు యిక్కడ వేంచేసి తమ ప్రచారముసల్పి కృతకృత్యు లగుదురని సవినయముగా ప్రార్థింపువారము

---





## వైదిక సిద్ధాంతాలు అమెరికాలో వ్యాపించుట

వేదాంతకేసరి అనుపత్రికలో భాయి మని లాల్ పారఖ్ అనువారిట్లు వ్రాయుచున్నారు.

“హిందూమత సిద్ధాంతాలకొన్ని క్రైస్తవుల పైప్రభావము కలిగించుచున్నవి. అదేవిధంగా క్రైస్తవమతములోని కొన్నిసిద్ధాంతములు ఇండియాలో పనిచేయుచున్నవి.

అమెరికాలో హిందూతత్వమునుగురించి జనులు ఎక్కువ శ్రద్ధతీసికొనుచున్నారు పునర్జన్మ కర్మసిద్ధాంతాలనుగురించి అమెరికాలో చాలమంది నాకంత తెలియునో అంతవరకుగూడా తెలిసి గ్రహించుకొన్నాను. రామకృష్ణ సంఘమువారీ విషయములో మంచిప్రబోధము కలిగించినారు. చనిపోయినతర్వాత శవాలను పూడ్చిపెట్టుట క్రైస్తవుల సర్వసాధారణాచారము. కాని అమెరికాలో చాలమంది శవములకుఅగ్నిసంస్కారము చేయనున్నారన్న చాలఆశ్చర్యము గానున్న విషయము. కాలిఫోర్నియానగరములో నూటికి ౩౫పాళ్ళు జనులు శవమును కాల్చుచున్నారు. అమెరికాలోని ఇతరప్రాంతాలలోకూడా ఈ అచారము వ్యాపించుకొనిపోవుచున్నది, దీనివలన అప్పటిజనులకు క్రైస్తవాచారాలలో భక్తి తక్కువగుచున్నదని విశదమగుచున్నది. ఆదికాలమునుండియు మొత్తంప్రపంచంలో హిందువులొక్కరే శవదహనముచేయుచు వచ్చినట్టివారు. అమెరికాలో ఈఆచారం వ్యాపించుకొనిపో తూఉన్నదంటే వాంఛర్యానికి మేరయేలేక పోయింది”

---

## ఒక చిత్రము!

### స్వయంభూ వినాయక విగ్రహము

బి. సీ. రామచంద్రారావు అనేఆయన జింజీ (ఆర్కాటుజిల్లా)లోని నీటివసతులశాఖలో మేస్త్రీగా పనిచేయుచున్నారు ఆతడిట్లు పత్రికలలో వ్రాసినాడు.-

దక్షిణ ఆర్కాటుజిల్లాలోని జింజీతాలూకాలో యెయ్యాల్ అనే గ్రామముండెను. ఈగ్రామములో ఒక సాధారణమైన రాతిగుండు అదంతలదే గణేశవిగ్రహముగా మారిపోయింది. సుమారు ౬౦ ఏండ్లక్రిందట ఆగ్రామం బయటిస్థలములో ఒక చెరువున్నది. అచ్చట గొల్లలు పశులను కాచుకొనుచుందురు. దానిసమీపంలో ఒక పెద్ద గుండుఉండింది. ఆగుండుపై క్రమక్రమంగా కొన్ని రేఖలు అవంతకవే ఏర్పడుచువచ్చెను ఇదేమిచిత్రమోఅని గొల్లలుదాన్ని బాగా పరికించుచువచ్చినారు ౧౯౩౧ సంవత్సరమునాటికి గణపతిరూపము అరాత్రి ఏర్పడినది బాగాకనపడింది. గ్రామజనులకు భక్తికలిగెను. మునియప్పరెడ్డి అనువారు సమీపమందలి కిలంపూండి అను గ్రామమువారు. వారు ఈరాతికి ఒక దేవాలయము కట్టించినారు. వారే దానికి ధర్మకర్తగా ఏర్పడినారు ౧౯౩౩లో నేను రెండవమారా రాతిని చూచితిని. అప్పటికింకను పూర్తివిగ్రహం ఏర్పడియుండలేదు. ౧౯౩౫లో తొండము, చెవులు, తల బాగాఏర్పడెను. గతమాసము అంపతేదిన నేనుమరల అక్కడికిపోయి చూచినాను. ఇప్పుడు గణపతివిగ్రహము పూర్తిగా ఏర్పడినది. ఇది యీకలియుగంలోని చిత్రాలలో ముఖ్యమైనది అని నేననుకుంటాను.”

---

## చెవుడు

### శాస్త్రోక్తమైన అద్భుత ఔషధము

మా “బధిరతాహరణ” నూనె చెవులకుసంబంధించిన చీముకారుట, కుట్టినట్లుండుట, ధ్వనులు, దురద, లోనిపొరలుచెడుట, చెవుడు, పూర్తిగాగాని, కొంతగాని, జలుబు, జ్వరము, క్వయినా అధికముగావాడుటవల్ల చెవుడు, మొదలగువాటికన్నిటికి త్వరలో గుణమిచ్చును. వెయ్యిలమంది దీనినివాడి అద్భుతమైన గుణమును పొందియున్నారు గుణములేనిచో పైకమువాపసు యివ్వబడును. రూ 2/-

ఆరోగ్యసదన్
దుర్గాదేవిస్ట్రీట్-బొంబాయి 4.

## కీ॥ శే॥ శనివారపు సుబ్బారావుగారు

శ్రీశనివారపు సుబ్బారావుగారు, గత రెండు సంవత్సరములనుండియు క్షయవ్యాధితో బాధపడి ౨౦—౬—౪౦ వ తేది రాత్రి ౧౧గంటలకు భార్యను, ౫గురు బిడ్డలనువీడి కృష్ణాయపాలెం గ్రామములో నిర్యాణముచెందినట్లు తేతలి సత్యనారాయణమూర్తిగారు ఆంధ్రపత్రికలో ప్రకటించినారు.

క్షయవ్యాధితో జీవించుటకష్టమనితోచి వారు ఈజూను నెల ౬వ తేదినాడుతమకుమార్తె వివాహముజరిపిరి.

వీరిస్వగ్రామము ముద్దాపురము, అత్తవారి గ్రామము కృష్ణాయపాలెము. అయినను కొన్నాటిలో ఇండ్లుసంపాదించి అక్కడనే నివాసమేర్పరచుకొనిరి. శేషవికిముందుమాత్రమే కృష్ణాయపాలెమునకువచ్చియుండిరి.

వీరు సామాన్యఆస్తితో, సామాన్యవిద్యతో ఒక పాఠశాలోపాధ్యాయులుగా జీవితముప్రారంభించి ౧౯౨౧లో గాంధిమహాత్ముని ఆదేశమునుసరించి ఉద్యోగమువదలి జాతీయసమరములో పాల్గొనిరి. పూర్వార్జితమైన ఆస్తిని గోల్పోయి, రెండుమూడుసారులు జెయిలుకుపోయి జిల్లానాయకులలో నొకరై కీర్తిగాంచిరి. తర్వాత మరణించువరకు ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీకి చీఫ్ఏజంటుగా పనిజరిపిరి. "సర్వలోకోపయుక్తగ్రంథమండలి"ని కొన్నాళ్ళునడిపిరి. "ఆంధ్రపత్రిక"కు విలేఖరిగా చాలకాలముండిరి. ఉత్తమలిష్టులసంఘములను స్థాపించిరి గ్రంథాలయసభలను ఏర్పాటుచేసిరి. రాజమహేంద్రవరములో రామదాసు కోఆపరేటివు ఇన్స్టిట్యూటును, గ్రామపునర్నిర్మాణపు పాఠశాలను, ఆంధ్ర కమర్షియల్ పాఠశాలను పెట్టించిరి. హిందూస్థాన్ పబ్లిషింగు కంపెనిని ఒకదానిని నెలకొల్పి జాతీయగ్రంథముల నెన్నింటినో ముద్రింపించిరి. తాడేపల్లిగూడెములో గ్రామపునర్నిర్మాణశుశ్రూషతరగతులను పెట్టించిరి. వయోజనవిద్యావ్యాప్తికి సభలేర్పాటుచేసియు, గ్రంథములు ప్రకటించియు చాల తోడ్పడిరి.

## బొంబాయికామాటిపురపు సానివారికథ

### సికింద్రాబాదుతో సంబంధము

బొంబాయినుండి జూను౧౭వ తేదినాడు "ఆంధ్రపత్రిక"కు దానిస్వకీయవిలేఖరి పంపిన శిశవార్తలో సికింద్రాబాదు ప్రశంస ఎత్తబడినది. సికింద్రాబాదు మున్నగు ప్రాంతములనుండి బొంబాయికి కూలిపనులకు పోయినవారలలో కొందరు చివరకు అక్కడ పడుపువృత్తిలో ప్రవేశించి పదేండ్లనుండి బొంబాయినగర భాగముగు కామాటిపురములో నొకభాగమందు ఇపుడు నివసించుచున్నట్లును, దానిపేరు సానివాడయని అక్కడి ఆంధ్రులు వ్యవహరించుచున్నట్లును, ఆసానివాడను అక్కడినుండి తొలగించుటకై ఇపుడు అక్కడిఆంధ్రులు ఆందోళన చేయుచున్నట్లును విలేఖరి తెలిపినాడు. కామాటిపురములో ఇటీవల ఒక పెద్ద మునిసిపల్ విద్యాలయమును కట్టించ నారంభించినారు. అదిపూర్తియైన తర్వాత అక్కడికి ౧౨౦౦మంది విద్యార్థులు పోవుచుందురు. అందువల్ల ఆప్రాంతమున సానివాడయుండుట తగదని తలచి తెలుగువారలు అక్కడినుండి పడుపువృత్తిగల స్త్రీలనందరిని లేవదీయించవలెనని పట్టుపట్టియున్నారు వారి ప్రయత్నముచే గవర్నరుగారి ప్రధాన సలహాదారు సర్ గిల్బర్టువెల్సుగారు ఆ సానివాడను చూచిపోయిరి.

కామాటిపురంలో ౩౦౦ తెలుగు కుటుంబాలున్నవి.



## యుద్ధంచే తూర్పుఆఫ్రికాతో ఇండియా వర్తకంహెచ్చుట

యుద్ధానంతరము తూర్పుఆఫ్రికాలోని కన్యా, ఉగాండా, టాంగనాయికాలలోని వర్తకవ్యాపారసంస్థలు యిండియానుండి కంబళ్లు, గోనెపట్టలు, భవననిర్మాణసంబంధమైన యినుముసామానులు, తివాసీలు, జంపఖానాలు, ఉన్నిగుడ్డలు, సైన్సు పనిముట్లు, చర్మముతో చేయబడిన సరకులు, పదునుచర్మము, రసాయనవస్తువులు ఎక్కువగా తెప్పించుకొన సాగినవి. బొంబాయిలోని ఒకవ్యాపారపుకంపెనీ ఇనుము ఉక్కు సామానులను తూర్పుఆఫ్రికాకు పంపగోరెను. తూర్పుఆఫ్రికాలోని వ్యాపారపుకంపెనీలతో పరిచయముకలుగ జేయబడెను.

## హెచ్చరిక

ఇందుమూలకముగా అందరకు తెలియబరచునదేమనగా, వేటునాతండ్రిగారగు, రేమిడిచర్ల కోటయ్యగారికి తమ్ముడును నాకుపినతండ్రియునగు రేమిడిచర్ల నాగయ్యగారు కొలదిదినములనుంచి పనులను, స్వార్థపరులునగు కొందరదుర్బోధలకు (వృద్ధాప్యదశలో)లోంగి సైబాంయిలాకా వరంగల్ జిల్లా మధిర తాలూకా రేమిడిచర్లగ్రామంలోని స్థిరచరాస్తులను అన్యాక్రాంతముచేయుదుద్దేశ్యముతోనున్నట్లు వారిపోకడలవల్ల తోచుచున్నది, ఆయనగారిమీద బాస్వతమాఖు ప్రాంసరీనోట్లుతాకట్టు పత్రములువగయిరాలు విష్వయు ఇప్పటికిలేవుమురెదుఉంచుటకుకారణము ఎమలేవు. ఇదిఅందరకును తెలిసినవిషయమే, ఇట్టిస్థితిలో ఆయనగారివల్ల ఏవరైనను ఎట్టిసమైన హక్కులను ఏరూపమున సంక్రమింపజేసుకొన్నను వాటికి నేనుగాని, నావారలుగాని అస్తులుగాని బైండుకాజాలకపోవుటయేగాక ఆయనగారి స్థిరచరాస్థులుపైతము బైండుకాజాలవు, సదరు నాగయ్యగారికినేను ముఖ్యవారసుడను హక్కుదారుడను, కావున పైవిషయములకు వ్యతిరేకముగా ప్రవర్తించి సదరుఆస్తులబాబతు హక్కుభుక్తములను సంక్రమింపజేసుకొనువారలు నాకుగలుగుకష్టనష్టములకు బాధ్యతవహించవలసినవారలై యుందురని తెలుసుకొనగలందులకై ఇందువల్ల హెచ్చరింపబడుచున్నారు. ఫక్తు

ఇట్లు,
రేమిడిచర్ల వెంకటకిషన్ రావు.

రేమిడిచర్ల, చ. ౧౪-౯-౧౩౪౯ ఫసలీ

## ప్రతిరోజు తేనె సేవనముచే లాభము

"సర్వులకు ఆరోగ్యము" అనుపేరుగల ఒక ఇంగ్లీషు ఆరోగ్యపత్రికలో ప్రతిరోజు ఉదయము ఆహారముతో కూడ తేనెసేవించుటవలన ఆశ్చర్యకరమైన విలువగల సేంద్రియలవణములు శరీరమునకులభించి, శరీరము ఆరోగ్యముగానుండునని వ్రాయబడినది తేనెలో రోగకారకబీజములు, క్రిములు దీర్ఘకాలము జీవించజాలవని కనుకొనబడినది. ఇపుడు తేనెను గాయాల చికిత్సలో ఉపయోగించుచున్నారు. అతిమూత్రవ్యాధిపీడితులు వైద్యులవద్ద ఏదైనారోగాలకు చికిత్సపొందుచున్నవారుమాత్రము వైద్యునినడిగి కనుగొనిగాని తేనెను వాడరాదు.

## పగలు నిద్రపొయ్యే చింతకాయచెట్టు

ఫిరోజాపూరు జిల్లాలోని బాచివాల్ గ్రామములో ఒక చింతకాయచెట్టు ఉదయం ౯ గంటలకు నిద్రప్రారంభించి మధ్యాహ్నము ౧౨ గంటలవేళకు పూర్తిగా భూమిపైకివాలి పండుకొనియుండుటయు, తర్వాత ౨ గం.ల వేళనుండి లేచుటకు ప్రారంభించి రాత్రి ౭ గం.ల వేళకు పూర్తిగాలేచుటయు చాలమందిజనులు పోయి చూచుచున్నారు.

## హెచ్చరిక

ఇంపీరియల్ బ్యాంకు బొంబాయినుంచితమశాఖయైన హైదరాబాదు-దక్కన్ ఇంపీరియల్ బ్యాంకు పేరట ఒక డిమాండు డ్రాఫ్టు నెం. (౧౮౫౮౪) రు ౩౧౦౦౦ విలువగలది నాపేర జారీచేసియుండిరి. పై డ్రాఫ్టు దొంగలింపబడినది. కాబట్టి సర్వజనులకు తెలియచేయడ మేమనగా పైనంబరు డ్రాఫ్టును కొనుటయుందేకాని అమ్ముటయుందేగాని యెవ్వరు ఏమాత్రము జోక్యము కలిగించుకొన గూడదు.

సంగయ్య గురుబసయ్య

దివాను మహంత్ మంజిల్
నాంపల్లి, హైదరాబాదు-దక్కన్.



## హిందుస్థాన్ మ్యూచుయల్ ఇన్సూరెన్సు

కంపెనీ లిమిటెడ్, మచిలీపట్టణము.

కంపెనీ మెంబర్లయొక్క సామాన్య, ప్రత్యేక సమావేశముల తాలూకు నోటీసులు.

1. 14-7-40వ తేదీసాయంకాలము 3 గంటలకు ప్రధాన కార్యాలయము ఆఫీసులోజరుగు ప్రత్యేకసమావేశములో నెం. 93, 96, 97, 98 ఆర్టికల్సును తీసివేయవలసినదిగా ప్రతిపాదింపబడును.

1 (a) 14-7-40వ తేదీ సాయంకాలము 4 గంటలకు ప్రధానకార్యాలయము ఆఫీసులో జరుగుసాధారణసమావేశములో 1940వ సంవత్సరము ఆడిటరు ఎన్నికకు బహ్మయ్య అండుకోవారిని అభ్యర్థిగా సూచిస్తూ కంపెనీషేరుదారైన కానూరు వెంకటరత్నంగారు నోటీసునిచ్చియున్నారు.

(b) ఆసమావేశములోనే పట్టాదారు డైరక్టరు ఎన్నికకు అభ్యర్థిగా శ్రీయుత బెజవాడ గోపాలరెడ్డిగారిని కానూరు వెంకటరత్నంగారు సూచించియున్నారు.

3 21-7-1940వ తేదీన సాయంకాలము 3½ గంటకు ప్రధాన కార్యాలయము ఆఫీసులో యీక్రిందవివరింపబడిన రిటైరింగు డైరక్టర్లస్థానములలో ఏజెంటు పట్టాదారుసభ్యుల క్రొత్త డైరక్టర్లను యెన్నుకొనుటకు ఏజెంటుపట్టాదారు సభ్యులసమావేశము జరుగుగాన తెలియపరచడమైనది.

(a) డి ఆర్. క్రిష్ణన్ నాయుడుగారు-పలమనేరు, చిత్తూరు జిల్లా.

(b) చెరుకువాడ వెంకటనరసింహం పంతులుగారు, బందరు.

రిటైరైన ఈయిద్దరు డైరక్టర్లు తిరిగియెన్నుకొనుటకర్హులు. అభ్యర్థులుగానుందురు.

బోర్డువారి అనుమతిని,
తల్లాప్రగడ రామరావు,
జనరల్ మేనేజరు.

## నైజాము ప్రజలకు హెచ్చరిక

నైజామునకును, బ్రిటిషుచకును వీ.పి. పద్ధతిలేకపోవుటచే మా అనుభూతమందులను, యితరమందులను గ్రంథములను తెప్పించుకొనుటకు యిబ్బందిపడుచూ అనేకమంది కోరుటచే యీక్రిందివారిని నైజాములో మాస్టాకిస్టులుగా యేర్పాటుచేసితిమి కావున నైజాముప్రజలకు యీవిషయము తెలియపర్చడ మయినది,

స్టాకిస్టులు:—మధిర డాక్టరు రామగోవిందం.
„ ఖమ్మంమెట్టు:-బొమ్మిడి రామకృష్ణయ్య సన్సు.
„ వరంగల్లు:-రవ్వాలింగయ్యగారు, లేక కుమారా ప్రింటింగ్ వర్క్సు.
„ శికింద్రాబాదు:-మూల్ చంద్ అండ్ కో, స్టేషన్ రోడ్.
„ హైదరాబాదు:-కింగ్ అండ్ కో.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

## బ్రిటిషుప్రభుత్వమునకు ఇండియాసరిహద్దుతెగల వారి సహాయవాగ్దానము

అఫ్ఘనిస్థానంమీదుగారష్యా ఇండియాపైకిదండెత్తుచో

ఇండియా వాయువ్య సరిహద్దు ప్రాంతములందుగల తెగలవారుకొందరు, బ్రిటిషుప్రభుత్వమువారికి సహాయముచేయుటకు సంకల్పించుకొనియున్నారు. డిల్, స్వాట్, బిట్రాఎయొక్క పొలిటికలుఏజంటువద్దకు ఆ ప్రాంతాలలోని కొండజాతులనాయకులు వాగ్దానములను పంపిరి. స్వాటులోనివారిప్రభువు ఇటీవల యుద్ధఖర్చుకై బ్రిటిషువారికి రు 30,000 దానముచేసెను. యుద్ధము జరిగినంతకాలము సాలుకు రూ 20000 చొప్పున యిచ్చెదనని వాగ్దానముచేసెను.

హాలింజాయి, బురాక్‌ఖేలు, ఇసాఖేలు, మూసాఖేలు, మైరా మొహమాండుల నాయకులు పెషావరులోని డిప్యూటీకమీషనరుకు తాము యుద్ధములో సహాయముచేసెదమని తెలియజేసిరి. ౨౫౦ మంది తాము సిద్ధముగానున్నామని తెలియజేసిరి. ౧౨,౦౦౦ మంది యుద్ధములో పోరాడుటకు వచ్చెదమనిరి. అఫ్రిడితెగ నాయకుడు తమ తెగవారుకూడా బ్రిటిషుప్రభుత్వమునకు సాయముచేయ సిద్ధముగా ఉన్నారని తెలియజేసెను. ఒరక్‌జాయి తెగవారు, సున్నీలు, షియాలు, జోవాకీలు రష్యాగాని జర్మనీగాని దండెత్తి వస్తే తప్పక ఎదిరించి పోరాడెదమని కోహాటులోని డిప్యూటీకమీషనరుకు తెలియజేసిరి, జాల్కాటీసు తెగవారు తమప్రాంతంలో ఎచటనైనను బ్రిటిషువిమానములు దిగవచ్చునని హజరాలోని డిప్యూటీకమీషనరుకు తెలియజేసిరి. ఖైబరు ఖాసాదార్లు అఫ్రిడిమాలిక్కులు, షిన్వారీ షిన్వారీ తెగలవారు తాముకూడా బ్రిటిషువారికి సాయము చేసెదమని ఖైబరులోనున్న పొలిటికలు ఏజంటుకు తెలియజేసిరి, రష్యనులు అఫ్ఘను స్థానముమీదుగా ఇండియాపైకి దండెత్తివచ్చినయెడల, తాము తప్పకఎదిరించి పోరాడెదమని అఫ్రిడీలు వాగ్దానముచేసిరి. మాలిక్దీను ఖేలుమాలికుల నాయకుడగు మాలిక అబ్దుల్‌లతీఫ్‌గారే అఫ్రిడీతెగలతరఫున మార్చినెలలో బహిరంగంగా చెప్పియుండిరి.

యుద్ధము ప్రకటింపబడినతోడనే జరిగిన జుమ్మానమాజులకు పిమ్మట బాదుషాగుల్‌గారుప్రసంగించుచు ఇట్లుచెప్పిరి. "సోవియటురష్యాలో అమలునందున్న కమ్యూనిజముపద్ధతి నాస్తికత్వముతోకూడినదైయున్నది. అట్టి కమ్యూనిజమువల్ల మహమ్మదీయమతమే నాశనముకాగలదు. కనుక రష్యా దండయాత్రను ఎదిరించి పోరాడవలెను.

## అమెరికా హొటళ్లలో అర్ధనగ్న సేవకులు

అమెరికాలో సాధ్యమైనంత తక్కువగా వస్త్రములనుధరించిన పురుషులను హోటళ్ళు మున్నగు విశ్రాంతిభవనాలలో సేవకులనుగా పెట్టుకొనుట ఎక్కువగుచున్నది. టెక్సాసులో డల్లాసునందు కొద్దుకొరంబడియుండు నొక విశ్రాంతిభవనములో ఇదివరకు కొద్ది వస్త్రాచ్ఛాదనగలస్త్రీలను పెట్టుచున్న యజమానులు ఇపుడుకొద్ది వస్త్రాచ్ఛాదనగలపురుషులను పళ్లెములలోఫలాహారములతో ద్వారాలవద్ద సిద్ధముగా నుంచుచున్నారు. వ్యాపారంచేసి అలసి విశ్రాంతిభవనాలకు వచ్చే స్త్రీలకు ఎల్లకాలమూ స్వల్పవస్త్రాచ్ఛాదనగల స్త్రీలనుమాత్రమే చూచిచూచి విసుగెత్తినదని హెచ్. యల్. హంగర్‌ఫర్డుగారిసతి చెప్పినదట. ఆమెసలహాపై ఈ క్రొత్తవింత ప్రారంభమైనది.

## సోడాఆషుపైసుంకములేదు

సిమ్లా, జూన్ ౨౧

సోడా ఆషు అనువస్తువు గాజుపాత్రల పరిశ్రమలో నుపయోగించును. ఈ వస్తువు భారతదేశములో విస్తారముగా లేకపోవుటచేత విదేశములనుండి దిగుమతియగు సోడా ఆషుపై ప్రభుత్వమువారు దిగుమతిసుంకములు తొలగించియుండిరి ఇంతవరకు సోడాఆష్ పరిశ్రమ మనదేశములో కొద్దిగామాత్రమే అభివృద్ధియైనది ఈ కారణముచే మరిరెండు సంవత్సరముల వరకు దేశములోనికి దిగుమతియగు సోడాఆషుపై దిగుమతిసుంకములు లేకుండచేయుటకు ప్రభుత్వమువారు నిశ్చయించిరి.

## చిఱుతపులిని కఱ్ఱలతోకొట్టి చంపుట

సూర్యాపేట ౧౭ అమర్షాదు

మా తాలూకా వెలుగుపల్లిఅను గ్రమములో, మొన్న టిదినము ప్రాతఃకాలమున గొల్లశాయన్న యనునతడు తనముగ్గురు సోదరులతోకలిసి, పూరిబయట గొఱ్ఱెలను మేపుకొనుచుండగా, ఒకపెద్ద చిఱుతపులి, మందవిూదపడి, రెండుగొఱ్ఱెలనుచంపెను. అంత వారు కఱ్ఱలతోను, గొడ్డళ్ళతోను, ముఖాముఖి పులితో పోట్లాడి, అక్రూర మృగమును తుదముట్టించిరి. కాని శాయన్నకు రెండు భుజములమీద బలమైనగాయములు తగిలినవి. అతని తమ్మునికొకనికి, క్రిందపెదవి, పూర్తిగా వూడిపోయినది.

వెలుగపల్లి గ్రామములో దవాఖానా స్థాపించి చాలా ప్రసిద్ధిపొందిన డాక్టరు కృష్ణమూర్తిగారుయీవిపత్తునుగురించివినితత్క్షణమేవచ్చి గాయములు తగిలినవారికి అవసరమైన చికిత్ససలిపిరి.

అధికధైర్యముతో పోరాడి మృగరాజునుచంపగలిగిన గొల్లసోదరులను, ఆపద్బాంధవునివలె సకాలమున సహాయపడిన డాక్టరుగారిని, గ్రామస్థులెల్లరు వేనోళ్ళ శ్లాఘించుచున్నారు.

సలుకునూరు వీరన్న

## భారతదేశానికి అమెరీగారు వత్తురా?

ఇపుడు బ్రిటిషుమంత్రివర్గమందు భారతదేశానికి మంత్రిగానున్న అమెరీగారు, కాంగ్రెసుకున్న ముస్లింలీగుకున్న కేంద్రప్రభుత్వమునందుకలిసి పనిచేసేవిషయమున ఏదైనను ఒడంబడిక కుదిరినట్లయితే, రాబోయ్యే అక్టోబరు నెలలోగాని నవంబరునెలలోగాని భారతదేశానికి రాగలరని లండనునగరములో అనుకొంటున్నారని "బొంబాయిక్రానికల్" పత్రికకు దాని విలేఖరి వ్రాసినాడు. గాంధిగారును, ఇతరకాంగ్రెసు నాయకులును కలిసి కేంద్రమునందు ముస్లింలీగుతో కలసి ప్రభుత్వములోచేరి, బ్రిటిషువారి యుద్ధప్రయత్నాలకు తోడ్పడునట్లుచేయుటకు మార్గాల నన్నిటిని ఆలోచించుచున్నారను ఒకవార్త బ్రిటిషువార్తాపత్రికలలో ప్రాముఖ్యస్థాన మీయబడినది.

## వరంగల్ యుద్ధసమితి

వరంగల్‌లో ౧౧మందిగల ఒక యుద్ధ సమితి యేర్పాటు చేయబడినది. సైన్యానికి మందిని సమకూర్చుట, చందాలు వసూలుచేయుట ప్రచారములను మూడువిషయాలలో ఈసమితి శ్రద్ధతీసుకొనగలదని ప్రకటింపబడినది.

## ఇండియా వైస్రాయిగారి పెద్దకొడుకు జాడలేదు

ఇండియా వైస్రాయిగారి పెద్దకుమారుడగు హోప్‌టౌన్‌గారి జాడ తెలియుటలేదు. వారు జర్మనులకు ఖైదీఅయివుండవచ్చునని ఒక సమాచారమువచ్చినది. గాని అధికారులనుండి ఎట్టి వివరములును తెలియుటలేదు.

## టైఫాయిడ్ జ్వరము లంఘనములచే విషమించునట!

ఇంతవరకును డాక్టర్లు టైఫాయిడుజ్వరపురోగికి బార్లీగంజిమాత్రము ఇచ్చుచూఉండేవారు. ఇపుడు ఇటీవలి పరిశోధనల ఫలితముగా అటువంటి లంఘనములచే రోగికి మంచికంటె చెడ్డే ఎక్కువగానున్నదని చెప్పుచున్నారు. శరీరములో ఉష్ణముకలిగించేపదార్థములను అహారంగా పెట్టవలెనని ఇపుడుతేల్చినట్లు "ఇండియన్ మెడికల్" జర్నలులో వ్రాయబడినది. మొత్తముమీద సామాన్యముగా ప్రతిపెద్దవానికిని రెండుమూడువేల కెలోరీల ప్రమాణపు ఉష్ణమునిచ్చు అహార పదార్థము కావలసియుండునని "ఇండియన్ మెడికల్ గజెట్" అభిప్రాయమిచ్చినది. ఏమేమి పదార్థములనువాడినయెడల సరిపోవుననువిషయములో ఏ. విశ్వనాథన్, యల్. యం. పి. గారు పాశ్చాత్యవైద్యులు చెప్పేపదార్థాలు మన ఇండియావారలకు పనికిరావనియు, ఒక్కొక్కరోగియొక్క తత్వమును గమనించుచు వైద్యుడు తదనుసారముగా అహారమును నిర్ణయించుచుండవలెననియు వ్రాసినారు.

## 1940 జులైలో జాతరలు-ఉరుసులకు

### ప్రత్యేక ప్రయాణ సౌకర్యములు

పండరి పురములో ఆషాఢ ఏకాదశి ఉత్సవము — 5 నుండి 15 జులై 1940 వరకు రైలుబస్సులకు కలుపుకొని చౌక రిటర్న్ టిక్కెట్లు యీ రైల్వేలోని కొన్నిస్టేషన్లనుండి పండరిపురమునకు లాతూరురోడ్డు (యన్.యస్.) మరియు లాతూరు (బి.యల్.) స్టేషన్లద్వారా యివ్వబడును. యీటిక్కెట్లతో తిరుగుప్రయాణమును 24 జులై 1940 అర్ధరాత్రిలోగా పూర్తిచేసుకొనవలెను.

ఈ ఆషాఢ ఉత్సవమునకుపోవు ప్రయాణీకుల సౌకర్యార్థము అవసరమైనచో అదనముగా ప్రత్యేకరైళ్లును బస్సులును ఏర్పాటు చేయబడును.

అనంతగిరి జాతర 16 జులై 1940 — 15 నుండి 18 జులై 1940 వరకు నెం. 1 అప్ మరియు 4 డౌన్ బండ్లు గోడంగూరు స్టేషన్‌వద్ద ఆగును. ప్రయాణీకుల సమ్మర్దమునుబట్టి అధికముగా బస్సులు వేయబడును,

మౌలానా మొయినుద్దీన్ సాహెబ్ ఉరుసు కోహీర్ (నైజాం) — 19 నుండి 23 జులై 1940 వరకు జరుగును. యాత్రికుల సమర్దము ననుసరించి రైళ్లకు అదనముగా పెట్టెలు వేయబడును.

మహంకాళి ఉత్సవము శికింద్రాబాదు — 21 జులై 1940 తేదిన యీ యుత్సవము జరుగును. అవసరమునుబట్టి రైళ్లకు పెట్టెలు అదనముగా వేయబడును.

మల్లేకు కొడ్డువద్ద జయతీర్థస్వామి జాతర — 21 నుండి 27 జులై 1940 వరకు నెం. 4 డౌన్ మరియు 1 అప్ రైళ్లు మల్‌ఖేడ్ స్టేషనువద్ద ఆపబడును.

జాతరలకు సమీపమునయున్న స్టేషన్లవద్ద ఫలహారములు దొరకు ఏర్పాట్లున్నవి.

యితర వివరములు:

చీఫ్ కమ్మర్షియల్ మేనేజరు
శికింద్రాబాదు.

మ.ఘ.వ. నిజాంస్టేటురైల్వే

## మ.ఘ.వ. నిజాం స్టేటురైల్వే నోటీసు

హైదరాబాదు-బెంగుళూరు-మద్రాసులమధ్య వారమునకు రెండుపర్యాయములు నడచుచున్న విమానసర్వీలు 7 జులై 1940 నుండి అపుచేయ బడును. మద్రాసునుండి హైదరాబాదునకు వచ్చు ఆఖరువిమానము 7 జులై 1940 నాడును హైదరాబాదునుండి మద్రాసుకుపోవు ఆఖరువిమానము 6 జులైనాడును బయలుదేరును.

ఏజ్ సూపరింటెండెంటు
మ.ఘ.వ. నిజాంస్టేటురైల్వే, శికింద్రాబాదు.



## పండరిపురమున ఆషాఢ ఉత్సవమునకు తగ్గింపు చార్జీలు

౫ నుండి 15 జులై 1940 వరకు (రెండురోజులు కలుపుకొని) లాతూరురోడ్డు ద్వారాను (యన్. యస్.) లాతూరు (బి.యల్.) ద్వారాను పండరిపురమునకు మూడవతరగతి చౌక రిటర్న్ టిక్కెట్లు రైలు, బస్సుచార్జీలు కలుపుకొని యీక్రింద పేర్కొనబడిన స్టేషన్లనుండి ఆయాస్టేషన్ల కెదురుగా చూపబడిన చార్జీలకు యివ్వబడును.

| | రు.అ.పై | | రు.అ.పై |
|---|---|---|---|
| బాసర్ | 8-13-0 | కారేపూర్ | 5- 1-0 |
| బస్మత్ నగర్ | 7- 8-0 | కర్ఖేలి | 8- 7-0 |
| భాల్కి | 6- 0-0 | మహమ్మదాబాదు బిదర్ | 6-11-0 |
| బోల్డా | 8- 0-0 | మాన్వత్ రోడ్డు | 7- 4-0 |
| ఛోండి | 7-11-0 | ముద్ఖేడ్ | 8- 0-0 |
| ధర్మాబాద్ | 8-12-0 | నాందేడ్ | 7-10-0 |
| ధోండి | 6- 8-0 | పాన్‌గాం | 5- 3-0 |
| గంగాఖేడ్ | 6- 5-0 | పర్భిణి | 6-12-0 |
| ఘట్‌నందూర్ | 5- 6-0 | పరుటూరు | 7-13-0 |
| హౌర్ | 5- 0-0 | పర్లివైద్యనాథ్ | 5-13-0 |
| హింగోలి (దక్కన్) | 8- 6-0 | పూర్ణా | 7- 4-0 |
| జాల్నా | 8- 7-0 | సైలు | 7- 7-0 |
| జాన్వాల్ | 4-14-9 | సింగనపూర్ | 6- 9-0 |
| కాలమ్నూరిరోడ్ | 8- 1-0 | ఉద్గీర్ (నైజాం) | 5- 4-0 |
| కొల్లుపూర్ | 5 12-0 | ఉమ్రి | 8- 4-0 |
| కమలానగర్ | 5-10-0 | వార్దగాం | 6- 1-0 |
| | | జహీరాబాదు | 7- 4-0 |

పిల్లలకు పై చార్జీలలో సగముచార్జీలు. ఈటిక్కెట్లు తిరుగు ప్రయాణమును 24 జులై 1940 తేది అర్ధరాత్రిలోగా పూర్తిచేసుకొనవలెను.

యితర వివరములకు —

చీఫ్ కమ్మర్షియల్ మేనేజరు, శికింద్రాబాదు.

మ.ఘ.వ. నైజాంస్టేటురైల్వే

## వైస్రాయి లిన్లిత్గోగారి రేడియోసందేశము

భారతదేశపు వైస్రాయి లిన్లిత్గోగారు జూను ౧౯వ తేదినాడు రేడియోద్వారా భారతీయుల కొసగిన ఒక సందేశములో ఫ్రాన్సుయుద్ధము విరమించినను, ఇంగ్లాండు జర్మనీనిలొంగదీయువరకు యుద్ధముసాగించగలదనిచెప్పి, భారతదేశములో దేశరక్షణ సన్నాహములను సాధ్యమైనంత ఎక్కువమేరకు తమప్రభుత్వము చేయుచున్నట్లు చెప్పిరి. ఆ మెరికానుండి విమానములను వాటి తయారుచేసేయంత్రములను కొనుటకు ఒకప్రతినిధిని అమెరికాకు పంపుచున్నామనిరి. లేనిపోనివదంతులను విని జనులు అధైర్యము చెందకూడదనిరి. దేశములో కలవరము లేకుండ కాపాడుట కేర్పరచు నినిక్ గార్డులనురాజకీయ భేదములతోగాని, మతభేదాలతోగాని సంబంధముండదనిరి. తుదకు దేశములోని అన్నిపార్టీలవారును తమవిభేదములను వదలి దేశరక్షణకార్యములకై ఐకమత్యముకలిగియుండవలెనని విన్నవించిరి,

## పంజాబు ప్రధాని పాకిస్థాన్ వాదము నిరసించుట

లాహోరు జూన్ ౧౮

పంజాబురాష్ట్రపు యుద్ధకమిటీ ప్రథమసమావేశములో పంజాబుగవర్నరు క్రెయిగుగారు ఉపన్యసించినతర్వాత పంజాబుప్రధాని సర్ సికందరుహయాతుఖాన్ గారు ఉపన్యసించుచు ఇట్లు హెచ్చరిక గావించిరి.—

"దేశమును రక్షింపవలసిన ఈముఖ్యసమయమున, మనలో మనము కలహించుకొనరాదు సిక్కురాజ్యము వెలయువలెనని సిక్కులు పాకిస్థాన్ వెలయవలెనని ముస్లిములు, రామరాజ్యము వెలయవలెనని హిందువులు, తగవులాడుకొనుటకిది సమయముకాదు పంజాబులో అందరి సమిష్టిరాజ్యము వెలయవలెననియే మనము కోరవలెను సంఘద్వేషములు పురికొల్పువారిని, ప్రజలలో ఇతరవిధములగు విభేదములను కల్పించువారిని ప్రభుత్వమువారు మన్నించరు

యుద్ధకమిటిలలో పాల్గొనవద్దని ముస్లింలీగు ఆదేశించినను, చాలమంది ముస్లింలీగువారు యుద్ధకమిటిలలోను, సూకమిటిలలోను సభ్యులుగా చేరిరి

నాగపూరు, జూను ౨౧

అఖిలభారత ఫార్వర్డుబ్లాకు సభయందు యితరతీర్మానములతోపాటు కాంగ్రెసులోచేరి అందొకపార్టీగా యికముందు ఫార్వర్డుబ్లాకు పనిచేయవలెనని తీర్మానించబడెను,

## ప్రజారక్షకసంఘాలు

భారతదేశములో ప్రతిరాష్ట్రములోను గవర్నరులు "సివిల్ గార్డులు" (ప్రజారక్షసంఘాలు) అనువాటిని కొందరతొందరగా ఏర్పాటు చేయుచున్నారు. అందులో శరీరబలము, యవ్వనము కలవారందరును చేరవచ్చును. వారికి రెండు మూడు మాసాలపాటు వారానికి మూడుదినాలు సైనికశిక్షణ యిప్పింతురు. మద్రాసులో ఇదివరకే యీయేర్పాట్లు అయిపోయినవి. దేశరక్షణావసరాలనుబట్టి గవర్నరులంతా ఎందరకాలము కొంచలకుపోవ్వనగ మానుకొని ప్రధానరగరులలోనేయుండి యీ యేర్పాట్లుచేయుచున్నారు.

పంజాబు ప్రభుత్వమువారున్ను ఈ సంఘాలను ఏర్పాటు చేయుచున్నారు. "దేవుడు పాపాన్ని క్షమింపజేయుగాక. హిట్లరుకే ఇండియాదొరికె యుగాంతము మనసుమనము చానిసలమే "అని సర్ ఛోటూరాం ఉపన్యసించెను. పంజాబులో ౩౨౦౦౦ మందిని భర్తీచేయుటకు ఏర్పాటుచేసినారు. ఢిల్లీలో చందాలు ప్రోగుచేయుటకొకసమితిని నిర్ణయింపనున్నారు. సరిహద్దుమూలాలో గవర్నరుగారు పర్యటనముచేయుచు పైగా వీరుకల్లినారు అచ్చటనురక్షకసంఘాల నేర్పాటుచేయనున్నారు. సికింద్రాబాదులోని పురప్రముఖులను సమావేశపరిచి జిల్లా మేజిస్ట్రేటుగారగు కెప్టన్ రష్టన్ గారు సభచేసినారు అచ్చటగూడ అవసరముండిన రక్షక సంఘాలను ఏర్పాటుచేయబడునని తెలిపినారు. యుద్ధనిధికి చందాలు వసూలుచేయుటకై ౧౬ మందిగల ఒక కమిటీని నియమించినారు.

## కీ. శే. శ్యామసుందరరావు గారు

పుచ్చల శ్యామసుందరరావుగారు ౧౬ జూన్ నాడు చనిపోయిరి ఆంధ్రదేశంలో ప్రసిద్ధిగాంచిన రైతునాయకులు వీరిస్వగ్రామము గంజాం జిల్లాలో ఇచ్ఛాపురం, ఆ ప్రాంతమువీరికిచాల భూములు కలవు వీరి ౧౯౦౩ లో జన్మించినారు. అనగా ౩౭ ఏండ్లలేప్రాయమందే వీరుచనిపోయిరి. వీరు కాలేజీలో చదువుచుండగా సహాయనిరాకరణోద్యమమువచ్చెను. ౧౯౨౧ లో కాలేజీనివిడిచి సత్యాగ్రహాముల పాల్గొని ౬ నెలలు శిక్షపొంది జైలుకుపోయిరి. వీరు తమస్వగ్రామముల గ్రంథాలయాన్ని స్థాపించినడిపినారు గ్రామయూనియన్ బోర్డుఅధ్యక్షులుగాపనిచేసినారు గంజాం జిల్లాలోని రైతులబాధలను తొలగించుటకు వీరుపూనుకొన్నారు. పలాసలో ఇటీవల నేలఖిల భారత కిసాన్ సభనుకావించినారు. ఇటీవలనే వీరినిఇండియారక్షణక్రింద స్వగ్రామములోనిర్బంధంచినారు ఇట్లుండగా ౧౦ దినాలక్రిందట ఆకస్మికముగా వీరుమరణించిరి.

పుదీనా ద్రావకం, పనసప్రాశ నలేహ్యము, గులకందు, గులాబు శర్బతులు

# శిలాప్రవంగము

(Si'apravanga)

అన్నివిధములైన భస్మములు, రసాయనములు, మాత్రలు, చూర్ణములు, ఆసవారిష్టములుకలిగి అందరిచే ఆదరించబడిన కంపెనీ,

## శ్రీధూత పాపేశ్వర పన్వేల్ (లిమిటెడ్)

నోటు—ఒకేసారి తీసుకొనదలచినవారు మాఏజన్సీతీసుకొనదలచినవారు హెడ్ఆఫీసులో కలువవచ్చును.

హెడ్డాఫీసు:—హరిపంత్ పస్ లేకర్ దవాఖానా

194 సుల్తాన్ బజారు, మార్కెట్టుసమీపమున, హైదరాబాదు-దక్కన్.

బ్రాంచి:—గుజరాత్ జనరల్ స్టోర్, జామామసీదుయెదుట, సికింద్రాబాదు.

## నూతన రకములబట్టలు కావలెనా? రండి!

ధర భేదమున్నచో వాపసు తీసుకొనబడును

# కైలాస వెంకన్నగారి శంకరయ్య

కింగ్స్ వే, సికింద్రాబాదు.

# ది హిందుస్థాన్ మ్యూచుయల్

## ఇన్సూరెన్సు కంపెనీలిమిటెడ్, మచిలీపట్నం.

డైరెక్టర్లబోర్డుకు అధ్యక్షులు డా॥ భో. పట్టాభి సీతారామయ్యగారు

పట్టాదార్లకు ప్రతినిధులకు అసమాన సౌకర్యములు గలవు:—

మహబూబ్ నగరు జిల్లాపట్టాదారులకు, ప్రతినిధులకు హెచ్చరిక

శ్రీయుత జానపాటి సత్యనారాయణగారిని ఈకంపెనీ తరఫున తమ జిల్లా ఆర్గనైజరుగా 1-3-40వ తేదినుండి నియమింపబడిరిగాన మీ వ్యవహారములు వారిద్వారా జరుపుకొన గోరెదము.

కె. సత్యమూర్తి

నిజాంరాష్ట్ర చీఫ్ ఆర్గనైజరు,

3415 కింగ్స్ వే, సికింద్రాబాదు.

ఈనోస్ "ఫ్రూట్ సాల్ట్" సేవించి తలనొప్పి రాకుండచేయుడు.

ENO'S FRUIT SALT

25 సం॥లనుండి ప్రఖ్యాతిచెందిన గ్యారంటీమందులు

# వీర్యస్తంభనరసాయనము

## 5 గంటలువీర్యముఆపును

తేనెలూరెడి తియ్యనిమందు నీరైనవీర్యమును గట్టిపర్చి మూత్రస్ఖలనము ఆపి అసలు స్త్రీవాంఛయేలేని నపుంసకులకు 70 సంవత్సరముల వృద్ధులకు, నవయౌవ్వనముగల్గించి స్త్రీ, పురుషుల కిరువురకు ఆనందముగల్గించి పూర్వమువలె కామభోగమనుభవించి సంతానవంతులగచేయుటకు 25 సం॥రములనుంచి జగత్ప్రఖ్యాతిబొందిన మందు అనేకమంది జడ్జీలు, మునసబులు, కవులు, శతావధానులు మొదలగువారిచే అంగ్రేజురాజ్యమంతయు వాడి పరీక్షింపబడినది. 3 పూటలలో ప్రత్యక్షగుణము లేకుంటేసొమ్ము వాపసుయివ్వబడును. 40 దినముల మందు రు. 5-0-0 వి పి. విడిగా ఏజంట్లుగాని, శాంపిలుగానిదొరకదు

## మకరధ్వజరసం

మేలిమిబంగారు కస్తూరి, అంబరు మొదలగునవి కలిపి నిర్మించిన మాత్రలు 1 మాత్ర వేసుకొని పాలుత్రాగినచో 1 గంటలో ప్రత్యేకశక్తి 70 సం॥రముల వృద్ధులకు కలిగి నీరైనవీర్యమును గట్టిపరచి స్ఖలనము ఆపుచేసి లింగము బిగువుగా వుండి స్త్రీ కి ఆనందము గల్గించి తృప్తిపరచుటకు గ్యారంటీ 1 మాత్రతో పనిచేయుకపోతే సొమ్ము వాపసు 1 సీసా మాత్రలు రు 10 వి పి. 0-8-0

## క్షయ-ఉబ్బసం

దగ్గు దమ్ము, పక్కనొప్పులు, శ్లేష్మం, 3 రోజులలో గుణం కనపడకపోతే సొమ్ము వాపసు

1 సీసా రూ 10 వి పి, 0-8-0

## నపుంసకతైలం

బాల్యములో ముష్టిమైథునంచేతను, రతిరోగముంచేతను కాలపరిమితిలేకుండ భోగించుటచేతను అంగమునరములు బలహీనతచెంది చిన్నభార్య యౌవ్వనము అనుభవించలేనివారికి గ్యారంటీ వృద్ధులకు పటుత్వము యిచ్చి పురుషత్వ సంభోగశక్తిని గల్గించుటకు గ్యారంటీ.

1 సీసా రు 10 అన్నపోస్టేజి వి పి 0-8-0

## హిస్టీరియ

స్త్రీలు తెలియక పడిపోవుట నోట నురుగు వచ్చుట శ్లేష్మంపడుట మూర్ఛ పిశాచ లక్షణములు 3 రోజులలోగుణం లేకపోతే సొమ్ము వాపసుకు గ్యారంటీ.

1 సీసా రు 10 వి పి 0-8-0

## గర్భనిరోధిని

అసంతానము దర్శించుటకు హేతువు- నూతన దంపతులకు సౌఖ్యమార్గము, బాల్య గర్భముచే మాతాశిశువులకు ప్రమాదము, ఏమాత్రము వ్యవధిలేకుండ వెంటనే గర్భము కలుగుచుండుటచే యౌవ్వనస్త్రీలు తమ యౌవ్వనము భోగొట్టుకొనెదరు. ఇంకను రహస్య స్త్రీలు, వైధవ్యలు కన్యలు అనేకచిక్కులు పడుచున్నారు. అట్టివారి కందరికి మహోపకారి యీ మందు సేవించిన శరీరారోగ్యమునకు యే మాత్రము భంగముకలుగదు అనేకమంది డాక్టర్లు పరీక్షించి వాడినారు,

1-2 సం॥రములు గర్భమురాకుండా అవుటకు రు 5, 4, 5 సం॥రముల వరకు గర్భం రాకుండుటకు రు. 10 జీవితంలో యెప్పటికీ రాకుండావుండుటకు రు. 25 జవాబుకు స్టాంపులు పంపవలెను

## కాయసిద్ధికల్పం

అనేకమంది డాక్టరిమందులను ఇంజక్షనులకు, కుదరక చిరకాలమునుంచివున్న దీర్ఘ బండిరోగములు కుదురుటకు పెట్టినదిపేరు. నీమమందులకు వేలకొలది రూపాయలు ఖర్చుపర్చి చివరకు కుదరక ప్రాణముపోసిన 72 సంవత్సరముల వృద్ధుడు శ్రీ మదనమోహన మాలవ్యాగారు యీ మందువల్లనే ఆరోగ్యవంతులైన సంగతి జగత్ప్రఖ్యాతిపొందినది 40 సంవత్సరములవారికి రోగములు జీర్ణించినవారికి వృద్ధులకు, స్త్రీలకు, బాలురకు యీరోజులలో వచ్చెడి సర్వ దీర్ఘవ్యాధులు, కీళ్లనొప్పులు, వాపులు, పోట్లు, తిమ్మెరలు, మూర్ఛ నంజు, అతిమూత్రం, అజీర్ణం, శూల, కడుపుబ్బరం, అతిదాహం, మధుమేహం, నిద్రపట్టకుండుట ఉబ్బసం రక్తపుపోటు, అధికస్థౌల్యం, సంభోగశక్తి అసలే లేకుండుట, క్షయ, అర్శమొలలు, భగంద్రం, శ్వాసకోసలు, అండవృద్ధి, పోటు, అండములు తూట్లు వగైరా వ్యాధులు గారంటీగా కుదురును. 40 దినములమందు రు 10 కల్పరు: రు 12 హాలీ అగును. వి పి. 0-8-0 జవాబుకుబిళ్లలు

డాక్టరు రత్నం అండ్ సన్సు మెడికల్ హాల్ 252 బి. పలకసేట, గవర్నమెంటుబిల్డింగ్సు, హైదరాబాదు-దక్కన్

మీబిడ్డలను ఆరోగ్యముగా యుంచుటకు

ఇక్ ఫాక్ టోక్

వాడుడు.

★ ★ ★

ఇక్ ఫాక్ టోక్ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ హైదరాబాదు-దక్కన్.

మందుల దుకాణము లన్నిటియందు అమ్మబడును.

Khan & sons

# తామెప్పుడైన హైదరాబాదునకువేంచేసినచో నాంపల్లి రాయల్ హోటల్ ను మరువకుడు

## [ఫోన్ నెం. ౩౪౬౨] అక్కడ ఉత్తమమైన ఏర్పాట్లు గలవు.

Khan and sons

